చందా వివరములు
ఆంధ్రపత్రిక

THE ANDHRA PATRIKA (WEEKLY EDITION) MADRAS సంపుటం 44. సంచిక 117 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO ఆదివారం 28-7-1957 Reg. No. M. 5745 12 పేజీలు 13 నయాపైసలు


# వైఖరి మారకపోతే గ్రామోద్యోగుల సంఘానికి గుర్తింపు ఉండదు

## సూయజ్ వదలాలని మెంజీస్ బెదిరించారు

### ఆస్ట్రేలియా ప్రధానిపై నాసర్ ఆరోపణ

అలెగ్జాండ్రియా, జూలై 25: సూయజ్ కాలువపై ఆధిపత్యాన్ని ఈజిప్టు వొదులుకుని అంతర్జాతీయ యాజమాన్యానికి అప్పగించాలని ఆస్ట్రేలియా ప్రధాని శ్రీ మెంజీస్ కైరో వచ్చి ఒత్తిడి చేశారనీ, అందుకు ఇష్టపడనప్పుడు తమను బెదిరించారనీ, ఈజిప్టు అధ్యక్షుడు శ్రీ నాసర్, ఇవాళ సూయజ్ జాతీయకరణ ప్రథమ వార్షికోత్సవ సందర్భంలో బహిరంగసభలో ప్రసంగిస్తూ ఆరోపించారు.

అలెగ్జాండ్రియా లిబర్టీ స్క్వేర్‌లో వేలాదిగా చేరిన ప్రజలను క్రింద పేరు ఆఖరు మాసాలలో జరిగిన సంఘటనలను గురించి శ్రీ నాసర్ వివరించి చెప్పారు.

స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్న దేశాలన్నిటికీ ఎదురు పెట్టడంకోసం, "ఈజిప్టును గుణపాఠం చెప్పాలని" బ్రిటన్ ఫ్రాన్సులు ఇజ్రేల్‌తో చేరి కుట్రపన్నాయని శ్రీ నాసర్ అన్నారు.

ఈజిప్టు బలం ఎంత ఉన్నదో తెలిసిన ఇజ్రేల్ దురాక్రమణకు దిగుతుందని ఎన్నడూ ఊహించలేదు. బ్రిటన్ పశ్చిమాసియాలో తనకుగల సర్వస్వాన్నీ ...

కంతో ఈజిప్టు లండన్ సభలో పాల్గొనాలని నిర్ణయించుకోంది, పాల్గొన్నంత మాత్రంలో అక్కడి వారి వైఖరి మారుతుందని ఈజిప్టుమాటలు వింటారని ఆశపడలేదు.

శ్రీ మెంజీస్ కైరో వచ్చి సూయజ్‌ను అంతర్జాతీయ యాజమాన్యానికి అప్పగించాలని అడిగారు.

సూయజ్ ఈజిప్టులో భాగం అనీ, దాన్ని అంతర్జాతీయం చేయ్యడానికి వీలులేదనీ వారికి జవాబిచ్చారు.

సూయజ్‌ను బలవంతాన వశపరుచు...

మెంజీస్ రాయబారం

అమెరికా వైఖరి

## ఆయుధాల కొనుగోలు

### రష్యా, సిరియా ఈజిప్ట్ దేశాల ఒడంబడిక

సిరియా రక్షణశాఖ మంత్రి ఖలీద్ ఎల్ అజమ్ ...

## నిర్బంధ ఆరోగ్య పథకం

### లోక్‌సభలో విమర్శ

న్యూఢిల్లీ, జూలై 26: ...

## గవర్నరుకు ముఖ్యమంత్రి వీడ్కోలు విందు

(8 వ పుట చూడుడు)

## నెలాఖరుదాకా వ్యవధి: రెవెన్యూ మంత్రి ప్రకటన

('ఆంధ్రపత్రిక' ప్రతినిధి)

హైదరాబాదు, జూలై 27: గ్రామోద్యోగుల సంఘం గుర్తింపును ఎందుకు రద్దు చేయరాదో - సంజాయిషీ చెప్పేందుకు ఆ సంఘానికి ఈ నెలాఖరుదాకా వ్యవధి ఇచ్చామనీ, ప్రస్తుతం అవలంబిస్తున్న వైఖరిని గ్రామోద్యోగులు మార్చుకుంటారని ఆశిస్తున్నామనీ రెవెన్యూమంత్రి శ్రీ కళా వెంకటరావు చెప్పారు.

ఒక్క కృష్ణాజిల్లాలో తప్ప మరెక్కడా గ్రామోద్యోగులు వ్యక్తిగతంగా జిల్లా కలెక్టర్లకు ఇంతవరకూ రాజీనామాలను అందచెయ్యలేదనీ, వ్యక్తిగతంగా రాజీనామాలను అందచేసినచోట్ల ఆయా గ్రామాధికారులను ఉద్యోగాలనుంచి తొలగించి వేరే ఏర్పాట్లు చేశారనీ అధికారులద్వారా తెలిసింది.

రాజీనామాలను ఇచ్చినవారు వాటిని రాష్ట్ర గ్రామోద్యోగుల సంఘం అధ్యక్షునికి పంపిస్తున్నారట.

## రెండు ఏళ్ళలో పోలీసులకు ఇళ్ళు

### ఆంధ్రప్రభుత్వ సంకల్పం

['ఆంధ్రపత్రిక' ప్రతినిధి]

హైదరాబాదు, జూలై 27: రెండు సంవత్సరాలలో రు 24,941 వేల ఖర్చుతో రాష్ట్రంలోని పోలీసు ఉద్యోగులకూ, పోలీసులకూ నివాసగృహాలను నిర్మించాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సంకల్పించింది. ఈ పథకానికి కేంద్రప్రభుత్వం ఇచ్చేసహాయంకూడా ఉంటుందని ఇవాళ శాసనసభలో అంతరంగిక వ్యవహారాల శాఖమంత్రి శ్రీ కె. వి. రంగారెడ్డి చెప్పారు.

రాష్ట్రప్రభుత్వం ఇదివరకే ఇందుకు రు. 4,075 వేలు ఖర్చుచేసి ఆంధ్రలో 20 ప్రాంతాలలోనూ, తెలంగాణాలో 6 కేంద్రాలలోనూ పోలీసులకు నివాసగృహాలను నిర్మించింది.

పోలీసుశాఖపద్దుకు రు. 5,12,57,700 ...

## ఆంధ్రప్రదేశ్ ఆర్థిక సంస్థ

హైదరాబాదు, జూలై 26: ఆంధ్రప్రదేశ్ ఆర్థిక సంస్థ (ఫైనాన్షియల్ కార్పొరేషన్) ...

## కమ్యూనిస్టు ఖైదీల శిక్షల రద్దు

### ఆలోచిస్తున్నట్లు న్యాయమంత్రి వివరణ

హైదరాబాదు, జూలై 27: ...

## దుబారా తగ్గింపుకు రాష్ట్రప్రభుత్వయోచన

### ప్రత్యేక సంఘం ఏర్పాటు

హైదరాబాదు, జూలై 27: ...

## ఆరోగ్య విజ్ఞానం అమెరికాలో శిక్షణ

### ఆంధ్రచే 4 పేర్ల సిఫార్సు

హైదరాబాదు, జూలై 27: ...

## హరిజనులలో విద్య

### ఎక్కువైందని మంత్రి వివరణ

హైదరాబాదు, జూలై 26: "1942 ..."

## భైరవానితిప్ప ప్రాజెక్టు నిర్మాణం

### 1958 ఏప్రిల్ ఆఖరుకు పూర్తికాగల అవకాశం

(స్వ. వి.)

## ఇంగ్లీష్ ఛానల్ కింద సొరంగం

పారిస్, జూలై 27: ...

## తంతి తపాలా ఉద్యోగులతో ప్రధాని చర్చల వైఫల్యం

### సమ్మె జరపాలనే నిర్ణయంలో మార్పులేదని సమాఖ్య ప్రకటన

న్యూఢిల్లీ, జూలై 26: తంతి, తపాలా ఉద్యోగులు తలపెట్టిన సమ్మెను విరమింపజేసేందుకు ప్రధాని నెహ్రూ, కార్మికశాఖా మంత్రి శ్రీ నందా చేసిన కృషి విఫలమైంది. సమ్మె జరపాలనే నిర్ణయంలో మార్పు ఏమీలేదని ఈ ఉభయులతోను జరిపిన చర్చల అనంతరం ఉద్యోగుల జాతీయ సమాఖ్య నాయకులు ప్రకటించారు.

ఉద్యోగుల ప్రతినిధులతో శ్రీ నెహ్రూ, నందా 70 నిమిషాల సేపు మాట్లాడారు. ఈ సంప్రదింపులు జరిగిన ఒక Kota తరువాత జాతీయ సమాఖ్య సంయుక్త కార్యాచరణ సంఘం సమావేశమై, పరిస్థితిని సమీక్ష చేసింది.

శ్రీ వి. జి. దాల్వి నాయకత్వం వహించారు.

### ఉద్యోగులకు నెహ్రూ హామీ

### బాగ్దాద్ కూటమి సైనికవ్యవస్థ

డైరెక్టర్‌గా పాకిస్తాన్ ... నియామకం

## జగ్గయ్యపేటలో కాఫీ హోటళ్ళకు దుకాణాలకు విద్యుచ్ఛక్తి

### వీధులలో విద్యుద్దీపాలు లేవు: పాఠాలకు, తోటలకు సరఫరాలేదు

జగ్గయ్యపేట, జూలై 28: ...

(స్వ. వి.)

## శ్రీ బృహత్స్తోత్రరత్నాకరం

శ్రేష్ఠమైన మనుష్యజన్మమును కృపచేసిన భగవంతుని దివ్యస్తోత్రములచే ప్రార్థించి ఇహపరశ్రేయము పొందుడు. లోకకల్యాణార్థము, దేవతలు, ఋషులు, జ్ఞానులు, భక్తశిరోమణులు కావ్యసాహిత్య వైభవములతో, మనోరంజకములను శక్తివంతములను పారమార్థికములను అగు దివ్యస్తోత్రములు రచించినవి 264 ఇందుగలవు. వినాయక 5, శివ 68, విష్ణు 70, శ్రీరామ 24, గంగాదితీర్థ 20, లక్ష్మ్యాదిదేవి 27, నవగ్రహ 36, వేదాంత 11 గలవు. నూతన ముద్రణము, గ్లేసు ప్రతి 560 పేజీలు, కాలికో బైండు. ధర రు. 6-0-0 పోస్టేజి 1-4-0.

M. G. Subbaraya Sastri & Sons, 18. Krishna Agraharam, Madras-1

## వాల్మీకి రామాయణము.

ఆంధ్రపత్రికలో వారము వారమూ ప్రకటించింది. ఆల్ ఇండియా రేడియోలో, వారము వారమూ బ్రాడ్‌కాస్టు చేసింది.

### సుందర కాండ

ద్వితీయ ముద్రణము - గ్లేజు కాగితమ్ త్రివర్ణ ముఖపత్రము. వెల రు. 2-50

బాల - అయోధ్య - అరణ్యకాండలు సంపుటము. వెల రు. 2-50

యుద్ధకాండ (రెండవ భాగము-రఫ్ కాగితముది) వెల రు. 2-50

కిష్కింధ కాండ - యుద్ధ కాండ మొదటి భాగము - అచ్చు అవుతున్నవి.

శ్రీనివాస శిరోమణి, 147/4, బాలాజీనగరు, రాయపేట: మద్రాస్ - 14.



## సామాపతమ్

[సంపాదకులు: శ్రీ కె. వాసుదేవశాస్త్రి, ప్రకాశకులు: ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం, మద్రాసు. మూల్యము: 2-0.]

ఆగమశాఖకు చెందిన గీతనృత్య కళలను వివరించే ఉద్గ్రంథం ఇది. దీనికి విపులమైన పీఠికను సంపాదకులు ఆంగ్లభాషలో వ్రాస్తూ గ్రంథహృదయమును విశదీకరించారు. వారికృషి బహుధా మెచ్చదగినది. దానికి అనుగుణంగా మద్రాసు ప్రభుత్వం ఆధ్వర్యాన ప్రచలితం అవుతూన్న ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం అధిపతులు చక్కని దేవనాగరలిపిలో ముద్రించి ప్రకటించారు. అందుకు వారికి ధన్యవాదాలు. తెలుగు వారికి అన్నివిధాలా అందుబాటు కావాలంటే దీనిని నృత్య గీత వాద్య విశారదులైన వారిచేత తెలుగుభాషలో వివరణ వ్రాయించి ప్రకటించవలసి ఉన్నది. దానికి అర్హతకలవారు ఆ పని చేయించితే తెలుగు బాలబాలికలకే కాక శబ్దశాస్త్రమునూ, నాట్యమునూ, గీతసంప్రదాయమునూ తెలుసుకొని ప్రత్యేక కృషిచేయ తలచుకొనేవారికి ఇది ఎంతో తోడ్పడుతుంది.

"ప్రణిపత్య మహేశానీ శంభు మాసీనమంతికే
పప్రచ్ఛ తత్త్వతో బ్రూహి నాదాం స్త్రమూపసంభవాణా—"

నాదములనూ తజ్జన్యములనూ పార్వతి ఉన్నది ఉన్నట్టు చెప్పవలసిందని ఈశ్వరుణ్ణి అడుగగా ఆయన చెబుతూన్నట్టు గ్రంథారంభం అయింది.

'శబ్దగుణకం ఆకాశం' అనే లక్షణాన్ని ప్రపంచించి ఉమాపతి ఉమకు బోధిస్తున్నాడు.

'యత్ర నాదస్య సంభూతి:
తత్ర తాలో విజృంభతే
నాదాత్మక మిదం దేవి!
సర్వం తాలమయం జగత్'—
'మహాప్రలయకాలేపి
సర్వభూతాపహారిణి
ఆకాశనాదయోర్నాస్తి
మూర్త్యయో: క్షయసంగమ:—"

సర్వభూత సహారం జరిగే ప్రలయకాలములో కూడా శబ్దగుణకమైన ఆకాశానికీ తజ్జన్యమైననాదానికి లయంలేదు. ఎక్కడ నాదంజనిస్తుందో అక్కడే తాళమూ కలుగుతుంది. అందువల్ల సర్వమూ నాదాత్మకమూ తాళమయమూ అయిఉంటుంది' — అని ఈశ్వరుడుముందు నాదోత్పత్తి విధానమును చెప్పి క్రమంగా గ్రామము, జాతి, స్వరము, శ్రుతి, మూర్ఛన, రాగప్రస్తారము, వేణువీణాలక్షణములు, తాళప్రస్తారము, తద్ద్వైవిధ్యము, నృత్యము, తల్లక్షణము, రసభావ లక్షణవివరణములు, ప్రబంధభేదములు బోధించాడు.

నృత్యగీత వాద్యాత్మకమైన సంగీతం ఐహికాముష్మిక శుభఫలప్రదమని అగమాలు ఉద్ఘోషిస్తున్నాయి. అది భారతీయులందరూ అనుభవములో గుర్తించిన పరమరహస్యం. నటరాజైన రాజమౌళిముఖత: వెలువడిన యీ శైవ సంగీతగ్రంథాన్ని ఎల్లరూ ఉపాసించి తరించగలరని మావిశ్వాసము.

* * *

### "వేణీ సంహారము"

[అనువాదం. శ్రీ బులుసు వెంకటేశ్వరులు. ప్రకాశకులు: వి. వి. అండ్ సన్సు, రామారావుపేట-కాకినాడ. వెల: 3-0-0]

భట్టనారాయణుడు సంస్కృతభాషలో వ్రాసిన వేణీసంహారం అనే నాటకానికి అనువాదం. ఇది మూలానికి విధేయముకాదు. అట్లని అవిధేయము కాదు. మొత్తముపై సరసమూ, సరళమూ అయిన అనువాదం.

చారిత్రకంగా ఇందులో ఒకవిషయం పరిశోధించవలసేది ఉన్నది. భట్టనారాయణుడు భారతాంధ్రీకరణమున నన్నయభట్టునకు తోడ్పడిన నారాయణభట్టే అయిఉండవచ్చునని పీఠికలో ఆంధ్రీకర్త కొంతచర్చించి ఉటంకించారు. అది యథార్థమైతే తెలుగు వాఙ్మయజీవితములో ఒకఉద్దండపాండితీ ధురంధరుడైన సంస్కృతకవి చేరి ఆజాతికి శిరోభూషణం అవుతున్నాడని మనం గర్వించాలి. అది తేల్చి చెప్పే ప్రాచీన చరిత్ర పరిశోధకులది.

అనువాద విషయములో శ్రీనాథుడులు కూడా ఒకొక్కచోట కాలు జార్చడం కనబడుతూ ఉంటుంది. ఇక నాటకానువాదం మాటలతో పని కాదు.

మొట్టమొదట ఈ నాటకాన్ని తెనిగించినవారు కీ॥ శే॥ కోరాడ రామచంద్రశాస్త్రిగారని వినికిడి. కాని అది అముద్రితమైనందువల్ల కాబోలు ఎవ్వరికీ తెలియరాలేదు.

రెండవవారు కీ॥ శే॥ వసురాయకవిగారు. దానికి తెలుగునాట పలుతావుల ప్రదర్శన భాగ్యంకూడా పట్టింది. ఆ విధంగా అది ప్రసిద్ధినందింది.

మూడవవారు కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు. వారదిమూలానికి ఎందునూ ఎదిరింపులేక సాగిపోయిన అనువాదం.

తరువాత కనవచ్చినది ఇదే.

వేణీసంహార నాటకములో ఆలంకారికుల మతం అనుసరించిచూస్తే నాయకుడు భీముడే అవుతాడు. రసం రౌద్రం అని మా విశ్వాసం. సోపపత్తికంగా కోవిదులు మా విశ్వాసాన్ని ఎదిరిస్తే శిరసావహిస్తాము. ఇందలి రసనాయక నిర్ణయవాదం చాలకాలంనుండీ అటే ఒక దారికి రాక ఉండిపోయింది.

ఇందు ప్రతి నాయకుడు దుర్యోధనుడు. మదోద్ధతుడు, మహాభిమాని. వానికి తగిన నాయకుడు ప్రియసాహసుడు భీముడు. కాగా ధీరోద్ధతుడు. తదాలంబనరసం రౌద్రం. ఫలం వేణీసంహారం భీమునివల్లనే ద్రౌపది పొందగలిగింది. ఇది మా నిర్ణయం. విజ్ఞులు నిరయించేవారు లేకపోలేదు.

'భగ్నమద్యోను భీమ ప్రభంజనమున
ప్రేరితగూర్చెడి నీ రథకేతనంబు
కింకిణీకాణబద్ధయై క్రిందబడియె
బిగ్గరగ నేడ్చునట్టుల ప్రియకరముగ,—

అనువాదం తీగలాగు అల్లుకొని వచ్చేవిధంగా ఇందలి అనువాదం హృదయరంజకంగానూ, ఉచితంగానూ ఉన్నది.

స్త్రీలకూ, నీచపాత్రలకూ సంస్కృత నాటకాలలో ప్రాకృతభాష ఉపయోగించడం పరిపాటి. దానికి తగ్గట్టుగా ఆంధ్రీకర్తలు పెద్దలు కొందరు శిష్టవ్యవహార భాష ప్రయోగిస్తున్నారు. వెంకటేశ్వరులుగారు తమ అనువాదములో ఆమార్గాన నడువలేదు.

### "కొత్త లోకము"

[రచన: శ్రీ బాపుజ. ప్రచురణ: ప్రభు అండ్ కో., గుంటూరు, వెల: 1-25]

వ్యత్యయము, తోలికోర్కె, మలికోర్కె అనే మూడు శీర్షికలలో వెలసిన పద్యకావ్యం. ఆంధ్రదేశపు గొప్పతనాన్ని వ్యక్తీకరించిన పద్యాల భాగం వ్యత్యయం. అందులోనిది ఈ క్రింది పద్యం.

"అడిన మాట తప్పని మహాత్ముని
చెప్పలజాడలోన కా
లాడ చరించెదరా ప్రజల కన్నము
కొట్టెడ వర్ణభేదపుం
తీడ వరించెదన్ గటికి చీకటివాపెద
బిడ్డనమ్మకా
అడనిబాధ మాన్పెదను సూనెద
కారకళాపుకారముల్—

## గ్రంథసమీక్ష

'తొలికోర్కె'లో పద్యాలు రెండు మచ్చుకి యీ క్రింద నిస్తున్నాను.

'మరుగోనరింప నేల యొకమాట
జగత్పరిరక్షణార్థమై
ధర లోకమాటు నీదగు రథంబు మరల్చిన
గొప్పవారి నుం
డిరముల స్వాగతంబుగొను నేటి
నియంతలయట్లుగాక; మా
హరిజనవాడలం దొలుత
సర్వ్రమగొమ్మ దయాపయోనిధీ!
"వాడు వారని పుష్ప పరిమళ సారంబు
చికిలించి తనువులు సృష్టిచేసి,
నగసహస్రములలో బిగియెల్లగొనివచ్చి
పసరుపాలిండ్లలో పాదుకొల్పి,
ఆణిముత్యపు చిప్పలందున్న సైగని
గ్యమును లావణ్యంబుగా బిగించి,
తీపిజారని పుటతేనెవాకల మాక
అధరబింబంబులయం దమర్చి,

కాంతలను సృష్టిచేయని కారణమున పెండ్లియాడిన భార్యల పిప్పిజేసి తిరుగుచున్నవి పురుషభూతములు కొన్ని స్త్రీత్వమిడి అట్టివారి శిక్షింపవోయి!' దేవుడితో ఇలా నివేదించుకొంటున్నారు నవయుగ కవిచక్రవర్తిగారు.

'మలికోర్కె'లో స్వీయము పరకీయములు రెండుమూడు సన్నివేశాలు వర్ణించారు. అవి సహజంగానే ఉన్నాయి.

'హృదయముగలట్టి రస రచయితను నేను'-అని తొలికోర్కెలో దేవునితో విన్నవించుకొంటున్నారు.

'మతపిచ్చిగాని, వర్ణో
న్మత్తిగానీ! స్వార్థచింతనముగానీ నా
కృతులందుండదు'—

అని చెప్పుకొంటూ 'మా హరిజనవాడ'- 'మాదిగలు' 'పంచములు'- అని స్వకీయజాత్యభిమానం వెల్లడించుకోడం పూర్వాపర సందర్భశుద్ధికి అఘాతమవుతుంది.

'ఇప్పటి మానవలోకం మత సాంఘిక రాజకీయాభిమానాలతో కొట్టుకుపోతూంది. మంచి లోకాన్ని సృష్టించు'-అని దేవుణ్ణి దమాయించి ప్రార్థిస్తున్నదే ఇందులో ప్రధాన విషయం-

ఈ కవితలో ఛందోవ్యాకరణ విషయాలపై పట్టుపట్టడం ఎందుకో నిరర్థకమనిపించింది.

'కళాకుటారం, పుష్పగంధగర్భం, తేనెవాకలమాక, లావణ్యము బిగించడం-ఈలాటివి ఏలా సాధువులూ, సమర్థనీయాలూ అవుతాయో మా ఊహకందలేదు.

పద్యాలనడక మాత్రం 'సాఫీ' గా ఉంది.

* * *

### "విశ్వశాంతి"

[మూలం: కాళిదాసు. అనువాదం: శ్రీ పురాణ పండ (ఉమశ్రీ) ప్రతులకు: రచయిత పేర, అలమూరు వ్రాయవలెను. వెల రు. 0-8-0.]

మహాకవి కాళిదాస రచితమైన కుమారసంభవ కథను ఆధారంగా తీసుకొని వ్యవహారభాషలో వచన కావ్యముగా వ్రాశారు శ్రీ ఉమశ్రీ.

దక్షప్రజాపతిని ఈశ్వరుడు గౌరవించలేదు. దక్షునకు కోపంవచ్చి ప్రతీకారం చేయాలని యజ్ఞంచేసి దానికి ఈశ్వరుణ్ణి మాత్రం ఆహ్వానించలేదు. పుట్టినింటిపైనున్న మమకారం చేయూతగా సతి యజ్ఞవాటికకు వెళ్లింది.

"భూతప్రేత పిశాచజాతులకు నాయకుడు, వల్లకాటికి వల్లభుడు అయిన దరిద్రుడి భార్యవుగా నీకిక్కడ ప్రవేశార్హత లేదు. కనుకనే అహ్వానించలేదు" అన్నాడు దక్షపతి. సతీదేవి మహాప్రళయ ప్రభంజనంలో గులాబీ రేకులా చలించిపోయింది...ఆ వేదన అధికమయింది. ఆ సమయంలో శైలాసంలోని జగత్త్రి తాముభాగం అదిరివడి. తరువాత దక్షాధ్వరధ్వంసం-తారకుడు చేస్తున్న ధూతహింస.

శివుని తపోదీక్ష, పార్వతి సేవ, మన్మథ వసంతాగమనం, మన్మథ దహనం, పార్వతి తపశ్చర్య, వధువును కోరడం, పార్వతీపరమేశ్వరుల కల్యాణము, కుమార జననం, దేవసేనానిగా కుమారుడు తారకునిపై దండెత్తడం, తారకవధ, విశ్వశాంతి—అందుకు ఈ కావ్యానికి విశ్వశాంతి అని పేరు పెట్టారు.

స్నిగ్ధమయిన శైలి, ముగ్ధమైన భావాలు. ఈశ్వరుడు తపస్సు చేస్తున్న వనంలో వసంతాగమన ఘట్టం ముద్దులొలుకుతూంది. కాళిదాసు దారి చూపుతూవుంటే ఏకహాయన కురంగిలా దాటులేస్తూ వెళ్లినకృతి. ముచ్చటగా ఉంది.

* * *

### "తిరుమల దేవ శతకము"

[రచన: శ్రీ కోటపల్లి కృష్ణమూర్తి, ప్రతులకు: గ్రంథకర్త, జడ్చర్ల-మహబూబ్ నగర్ జిల్లా. వెల: 0-8-0.]

శతక కృతులంటే చాలామందికి ఎందుకో నీరసమైన చిన్నచూపు ఉంటుంది. కాని శతకం వ్రాయడం చాలా ఇరుకైనచోట కూర్చోపెడతుంది. మన భాషలో శతక వాఙ్మయానికి మంచి పేరు ఉంది. కవిబ్రహ్మ తిక్కన సోమయాజికూడా శతకం వ్రాసినట్లు చరిత్రకారులు చెబుతున్నారు. మహాకవి ధూర్జటి వ్రాసిన శ్రీ కాళహస్తీశ్వర శతకం మనలో చాలామందికి తెలుసు.

శతకం భక్తిభావ భరితమై భగవంతునికీ, భక్తునకూ మధ్య ఉండే అనుబంధాన్ని సూచిస్తూ ఉంటుంది. శతకకవి తన కష్టసుఖాలూ, లాలస తండ్రి దగ్గర చెప్పుకున్నట్లు భగవంతునితో చెప్పుకుంటాడు. భక్తిభావభరితమైన శతకంలో చాటూ, మాటూ ఉండదు. సంస్కృతి తరణోపాయములలో శతక రచనకు ఎక్కువ ప్రాధాన్యం ఉన్నట్టు మన వాఙ్మయంవల్ల తెలుస్తుంది. సంఘసంస్కరణోద్దేశముతో వేమనాదులు రచించిన కొన్ని విజ్ఞాన బోధకములైన శతకములలోకూడా భక్తికి స్థానం లేకపోలేదు.

ప్రకృత శతకం ఒక నియమబద్ధమైన రచన. అన్నీ కంద పద్యాలే. శతప్రాస యతిమిది. 'తిరుపతి భూధర నివాస! తిరుమల దేవా!' అని వాల్లవ చరణం. ఇది కొంత కష్టసాధ్యమైన పని అనే చెప్పి కవి కృతకృత్యుడైనందుకు మన ప్రశంస అలా ఉండగా శ్రీపతి వెంకటేశ్వరులు తప్పక అనుగ్రహిస్తారని ఆసిద్దాము.

'అరిషడ్వర్గము మాలో
స్థిరముగ నెలవొందెఁ గానఁ జేరము
నిన్నున్
గరుణింపు మెట్టు లేనియుఁ
దిరుపతి భూధర నివాస! తిరుమల
దేవా!

పరిశుద్ధమైన రచన. శిష్యులందరూ అచ్చువేయించారని తొలిపలుకువల్ల తెలుస్తూంది. గురువునకు తగిన శిష్యులు. ఈ సందర్భములో వారినికూడా ప్రశంసించవలసి ఉంది.

* * *

### "వీథిబడి"

[రచయిత: శ్రీ వి. యస్. అవధాని, ప్రతులకు: ఆదర్శ గ్రంథమండలి-విజయవాడ. వెల: 0-10-0]

పిల్లలకోసం వ్రాసిన కథల సంపుటి. మొదటికథ వీథిబడి. ఇంకా ఫౌంటెన్ పెన్, చిన్నా-పెద్దా, చిన్నతనంలో చేష్టతనం, కొంపతీసిన స్కేలు అనే నాలుగు కథలు ఉన్నాయి.

విస్పష్టార్థంగా వివిధ విషయాలనూ విజ్ఞానప్రబోధంతో విద్యార్థులకు ప్రాథమిక విద్యాబోధనలోనే మారిపోసే పాతకాలపు పంతులు నరసయ్య జీవితాన్ని ప్రదర్శించేకథ 'వీథిబడి.' దానివల్ల ప్రాచీన ప్రాథమిక విద్యావిధానం తెలుస్తుంది. ఈనాటి విద్యావిధానంపై కొత్త అనుకోకుండా కలుగుతుంది.

తోడిపిల్లలకున్న వస్తువులు తమకు లేవనీ, అవి కావాలనీ, ఈయలేని తల్లిదండ్రులదగ్గర అవి కావాలని చెప్పలేని బడిపిల్లల మనస్తత్వాన్నీ, ఆవేదననూ ఎంతో సున్నితంగా చెప్పేకథ 'ఫౌంటెన్ పెన్'—

పెద్దలకు బుద్ధిచెప్పేకథ 'చిన్నా-పెద్దా' - అన్నిటికంటే హృదయాన్ని బిగువుగా పట్టుకొని ద్రవింపచేసేకథ 'కొంపతీసిన స్కేలు' - కల్లాకపటంలేని బీదవిద్యార్థి సుబ్బారావువంటి ఆత్మాభిమానంకలవాడు తరగతికి ఒక్కడేనా ఉండకపోడు. 'అయ్యో! ఏమైపోయాడో!'-అని చదివినవాడు అనుకోకుండా-అనుకోకుండానే కళ్లు చెమ్మగిల్లుతాయి. వీథిబడిపిల్లలు ఈ 'వీథిబడి' కథలను చదివితే వారి మనస్తత్వాలు మంచిదారికి వస్తాయి. అవధానిగారికలం వీథిబడి విద్యార్థుల దైనందిన జీవితాలను కథాప్రపంచములో చిత్రించడానికిచేసిన కృషి హర్షించదగినదన్నది.

### "శ్రీరామకృష్ణుడు-వివేకానందస్వామి"

[మూలం: శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ; అనువాదం: శ్రీ కందుకూరు మల్లికార్జునం, ప్రాప్తిస్థానం: శ్రీరామకృష్ణమఠం, మైలాపూర్, మద్రాసు 4. మూల్యము: 0-25.]

పరమహంస నూటపదునాల్గవ జన్మదినోత్సవ సందర్భములో 1949 మార్చి 20వ తేదీనాడు న్యూఢిల్లీలో శ్రీ రామకృష్ణ మిషన్ భవనములో శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ఇచ్చిన ఉపన్యాసానికి ఇది అనువాదం. రాజకీయతంత్రాలలో ఆరితేరి పరిపాలక పీఠముపై ఉన్న ప్రముఖ నాయకుని ప్రసంగం. ఆంధ్రములోనికి అనువదించిన మల్లికార్జునంగారి పని ఘనమైందని మెచ్చుకోవలసిందే.

పండిట్‌జీ ప్రసంగంలో చాలుగా దు పంక్తులు ఉదాహరిస్తున్నాను.

"శ్రీరామకృష్ణ పరమహంస జీవితమునుగూర్చియు, సందేశమునుగూర్చియు ఉపన్యసించుటకు నాకు అంతగా అర్హత కలదని నాకు తోచదు. ఆయన దైవికత్వమునకు చెందినవాడు. నేను పృథ్వీతత్వమునకు చెంది కాలమంతయును ప్రాపంచికవ్యాపారములందే వినియోగించువాడను. శ్రీ రామకృష్ణ పరమహంస మానవసామాన్యమార్గమున మాత్రమును సంబంధించినవాడు కాదనుట స్పష్టము. జీవితము యొక్కయు, ఆత్మయొక్కయు ఉన్న కటతపర్యములపై మనబుదిని మరల్చిచేయుటకై అప్పుడప్పుడ దవతరించు చుండిన హైందవ మహర్షి సంప్రదాయమునకు ఆయన చెందినవాడని తోచుచున్నది ... స్వామిజీ వ్రాసినదియు, చెప్పినదియు చదువ మనకు ఇప్పటికిని కుతూహలమునగనే యున్నది. ఇట్టి కుతూహలము మనకు ఉండియే తీరవలెను. అది మనపై నింకను చాలకాలము తన ప్రాభవము పఅపుచునే యుండ...

కోవుడు. సామాన్యార్థములో ఆయన రాజ్యవ్యవహారవేత్త కాదు. కాని హిందూదేశములోని ఆధునిక జాతీయోద్యమ నిర్మాతృప్రముఖులలో ఆయన ఒకడు...ప్రత్యక్షముగనో, పరోక్షముగనో నేటి హిందూజాతిపై ఆయన తేజశ్శక్తి ప్రబలముగా ప్రయోగింపబడుచున్నది. నేటి మనయువకులు వివేకానంద స్వామికడనుండి బయలు పడు విజ్ఞాన, ధైర్య ప్రతాప ప్రవాహమును ఆధారపడుచుకొందురని నాకు తోచుచున్నది."

పరమహంస కాళీ అంశ అనీ, వివేకానందస్వామి సనకమహర్షి అంశ అనీ ఒక యౌగికవాదం వినవస్తుంది. ఆ దివ్యమూర్తులగురించి ఎవరేనా విశిష్టమార్గంలోనే మాటాడుతారు; పండిట్‌జీ చెప్పినట్లు వారు దైవిప్రకృతికి చెందినవారు.

యామిజాల పద్మనాభస్వామి

* * *

### రంగవల్లి

[రచన: శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి; ప్రకాశకులు: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2. వెల: రు 1.25]

గణ యతి ప్రాసలతో కైతల్లడం ఎంత ఘనతో, చక్కని వచనరచన చేయడంకూడా అంతే ఘనత; అందులోనూ కథారచన మరీ ఘనత. సుందర పదలాలిత్యమే కథాగమనానికి మూలం. పూర్వకవులు కూడా - కథా సాహిత్యాన్ని దృష్టిలో పెట్టుకునే- పద్యాత్మకమైనా, గద్యాత్మకమైనా, పద్యగద్యాత్మకమైనా-తమ రచనలు సాగించారు.

సమాజంలోని మంచిచెడులను సౌజన్యంతో విమర్శిస్తూ నీతిబోధ చేయడమే కథాసాహిత్యానికి పరమావధి. దానిని దృష్టిలో పెట్టుకునే శ్రీయుతులు వేలూరి శివరామశాస్త్రి, గుడిపాటి వెంకటచలం, మల్లాది రామకృష్ణశాస్త్రి ప్రభృతులు కథారచన సాగించారు.

కథారచన ఎన్నివిధాలుగా వ్రాయ వీలగునో అన్నివిధాలుగా వ్రాయడంలోనైతేనేం - తేలికభాషలో, పలుకుబడితో వ్రాయడంలోనైతేనేం రామకృష్ణశాస్త్రిగారు సిద్ధహస్తులు.

ఈ 'రంగవల్లి'లో కొన్ని పదాలు చూడండి:

"మనస్సుతోనే వ్యూహాలు పన్ని, ఊహలతోనే ఆటకట్టించే ఎత్తు దుమికించడం మహామంత్రుల ప్రజ్ఞ" కనుకనే "నాయనా! రాజతంత్రంలో కయ్యానికే కాదు వియ్యానికీ అంత ప్రాముఖ్యం ఉంది! మన సీమలో ఉండే ఆ సీమ ఏలికలను అనుక్షణం అదుపులో ఉంచనొద్దా? కత్తిపదునుకు చేరువుగా వాళ్ల కన్నెలను తెచ్చుకుంటే - ఏనాటికీ మనకు వాళ్లు పాదాక్రాంతులే! కత్తికి ఒక్కటే పదును, రాజనీతికి వేయి పదును లున్నాయి" (పుట 16) అని చెప్పాడు తిమ్మరుసు.

"చూడగా చూడగా, కరాన గాద్దికం - కళాన కలవరం - రాయలవారు ఒక్క నిమేషం, మామూలు మనిషల్లే అయిపోయి — అంతలో తిరి సంబాళించుకుని - కత్తి పదునంతి కన్ను చేసి- విసరబోయినారు: ... 'ఆ చిన్నదాని కంటివంక, చేతికత్తిపదును వంక చూస్తూ చూపులు సాన బెడుతున్నాడు."
(పుట 19)

"అయ్యవారి సరసను పోకరిలి నాయకురాలు అన్నదికండా-'మాయా మర్మమూ విడిచిన చోటు, మనసూ మనసూ దక్కినచోటు, - ఆ లయం నాలోవుంది, నీలోవుంది - నాయకుడా మన వగసం కొలుచుకుంటుందయ్యా!"
(పుట 58)

"ఏం దరిద్రులమా? అన్నదొ కత్తి! కాకపోతే - మాసీమలో కొలువు చేదలా? పుట్టిన గడ్డమీద గూడుంచే - కట్టుకున్న అలంకో ... ముప్పొద్దులా బువ్వంతే - యిలా దుమ్ముకూ ధూళికీ కొట్టుకోవాలా?" హరికథ చెప్పినట్లు అడుగు ముందుకు వేస్తూ అంటున్నాడు సింగన!
(పుట 116)

"నేను లేనుటే తల్లుల్లారా! కొమ్ముల పండుగ మనపైనే - పోరాణి నేను పూయనా? అ గుండెలు డొల్ల-అరకం బురద: నాకోసం శుద్ధి బుద్ధి చెరుపుకుంటారా!" గోపులన్నింటికీ సింగన్న మనసు తెలిసిందే! అడక్కుండా దురుసుగానికి పోయినాము అని కించపడుతూ బెదురుచూపులు చూసినాయ్:
(పుట 117)

"తన రెండో కూతురి అందచందాలూ, చురుకుదనం, గొంతు స్వారస్యం- భాగవతంలో ఎన్ని పద్యాలు నోటికి వచ్చింది - ఎంత కాలంతో దుడుకున్నదీ- తాను ఇదివరకు పెద్ద అల్లుడికి ఎంతెంత ముట్టచెప్పింది. దేశకాల పరిస్థితులను బట్టి, అ భద్రాద్రిరాముడి కృపవల్లా, తాను ప్రస్తుతం ఎంతకు తూగగలిగిందీ- దశావేజుమతలబీలో ఏకరువుపెట్టి - సరే అంటే సరే అనమని కుతారంగా మొదలు పెరిచాడు. (151-52 పుటలు)

ఇలా ఎన్ని పదాలు ఎత్తి చూపించినా తనివి తీరదు. కథలో లయలూ ఒక ఛందస్సూ ఉందని చూపే కళ్ళిగల రచయిత శాస్త్రిగారు.

* *

### గుడిగోపురం

[రచన: శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి ప్రచురణ: రసలహరి, అమలాపురం; వెల: రూపాయి.]

ఇందులో వున్నవి మొత్తం మూడు కథలు. వెంకన్నబాబు, భిన్నధ్రువాలు, గుడిగోపురం.

ఇక ఈ కథల్లో:—

"దూడ కొస్తా మెడవాల్చిందంటే పశువైద్యుని దగ్గరకు పరుగెడుతున్నాడు గాని పాపాయికి జబ్బు చేసిందని భార్య గౌరీ నోరూ మొత్తుకున్నా చెవిని పెట్టించలేదు సుబ్బన్న" (పుట 2).

"అబ్బాయికి నామకరణమహోత్సవం జరుగుతుంటే సుబ్బన్న దూళ్ళశాలలో గిత్తదూడ గంగడోలు గోకుతూ గోమారు తీస్తున్నాడు!" (పుట 2)

ఎంత అసందర్భం! ఎంత అతిశయోక్తి!!

"నామకరణం చేశాక అన్నప్రాశనం అన్నారు అబ్బాయికి" (పుట 8).

శ్రీరామమూర్తిగారు సృష్టించిన అబ్బాయికి పదవ నెలలోగాని పుస్మిం... దవ నెలలోగాని నామకరణంతో అన్నప్రాశనం జరిగి ఉండాలి. నయం!

మొత్తానికి ఈ కథలో సుబ్బన్న కన్నకడుపునీ, కాపురాన్నీ కూడా విస్మరించి, దూడమీద ప్రేమతో దాన్ని సాకగా, ఆ దూడ పెరిగి 'వెంకన్నబాబు' అనే అబోతుగా మారి సుబ్బన్న చావుకే మూలమవుతుంది.

వాస్తవానికి చేరువగా వున్నట్టు కనిపిస్తూ చాలా దూరంగా వున్న కథ.

* * *

### సంజ ప్రణయం

[రచన: పూషా; ప్రకాశకులు: శోభా ప్రచురణలు; విజయనగరం; వెల 50 నయాపైసాలు]

ఇందులో మొత్తం పది కథలు ఉన్నాయి.

విషయసూచికలో చివరను "ఈ కథలూ గల్పికలూలోని పాత్రలూ, సంఘటనలూ కేవలం కల్పితం" అని వ్రాసుకున్నారు. అదే కొంచెం ఆశ్చర్యంగా కనిపిస్తోంది. ఇటీవల వెలువడుతున్న అపరాధ పరిశోధక నవలలు మీద చూసి పూషాగారు అదో సాపుగా భావించి అనుకరించారో, లేక లోగడ ఈకథలు అచ్చు కావడంతోనే ఎవరేనా ఏదేనా అన్నదానికి ఈప్రకారంగా 'మనవిచేశారో' బోధపడ్డంలేదు.

ఎప్పుడేనా లోకంలో జరిగే చిన్న సంఘటనని చిలవలు పలవలుగా చిత్రించి కల్పిస్తేనే కథ అవుతుంది. అంతమాత్రంచేత ఎవరేం అనుకుని పోతారోనని ఈమాత్రంగా భయపడనక్కర్లేదు. మంచివ్రాస్తూ ఉంటే సరి.

### బాల వినోదకథలు

రచయితలు: మహేంద్రవాడ వీరగణపతి శాస్త్రి, మహేంద్రవాడ సత్యనారాయణ మూర్తి. పబ్లిషర్స్: మహేంద్రవాడ పబ్లిషింగ్ హౌస్, యానాం. వెల 0-6-0

రచయితలు పరిచయ వాక్యాల్లో వ్రాసినట్లుగా చిన్న తరగతి పిల్లలకి పఠనాసక్తిని పెంపుచేసేందుకు నీతిబోధనకూ ఉద్దేశించిన కథల పుస్తకం. మనకి పంచతంత్రపు కథలు, ఈసపు నీతికథలు మించినవేవీ నీతిగరపే కథలు లేవేలేవు. పైగా బాలలకి పఠనాశక్తి కలిగించే పుస్తకాలు బహు తక్కువ. అందువల్ల రచయితల కృషి ప్రశంసించదగ్గది.

—భారవి

* * *

### డిటెక్టివ్ కేయాస్

రచయిత: శ్రీ టి. వి. శంకరమ్, ప్రకాశకులు: సాగర్ పబ్లికేషన్సు, 11 బ్రాడ్వే, మద్రాసు-1. వెల 75 న. పై.

ఇది 'మాపూర్వ మాపరాధ పరిశోధక' కథల సంపుటం. అపరాధ పరిశోధక (తెలుగులో 'డిటెక్టివ్') నవలలంటే చెవి కోసుకునే (కోసుకున్న) వారికి ఇది (తిర్వాతి) మంచి మందు. ఇంగ్లీషు మాటలను సముచిత ఉచ్చారణతో ప్రయోగించారు—తెలుగు నాగరకులు వంటజీర్ణించుకోనదగినవి. ఇప్పటికే ఉంటున్న పోకు భావాలకూ భావమున్న 'డిటెక్టివ్ కేయాస్' కలుస్తే, సమర్థులవు [illegible]. ఇందులో కథలు ఇవి: కొత్త డిటెక్టివ్ ప్రవేశం, మాశ్వాశ్చర్యం లేక అంతుపడితో, పారిపోయిన శవం, రైల్లో డిటెక్టివ్, పారిపోయిన అసిస్టెంట్, హోటల్ రాకాసిలో డిటెక్టివ్ ధూతం, గవరయ్య మాజ గౌర ప్రతిజ్ఞ, దీపం తెచ్చిపెట్టిన మిస్టరీ, విచ్చిపోయిన మిస్టరీ.

మనదేశంలో కనివిని ఎరగని అపరాధాలతోనూ, పరిశోధనలతోనూ కథలు అల్లిఅమ్మేస్తున్నారు. అవి చదవగా, చదవగా బుర్రలో భయోత్పాతైన శివాలకు ఇది ప్రదర్శనాలయంలాంటిది.

* * *

### ధ్యానపద్ధతి

రచయిత: శ్రీ కుందుర్తి వెంకటనరసయ్య, ప్రకాశకులు: శ్రీ రామకోటగణమందిరము, బుద్ధాం, యాబలిపోస్టు, బాపట్లతాలూకా, వెల అర్ధరూపాయి.

* * *

### అనుకోని హత్య

రచయిత: శ్రీ రాంషా, ప్రకాశకులు: కళాశ్రీ పబ్లికేషన్స్, పామర్రు కోట, వెల 50 న. పై.

## గంటల పంచాంగం

శ్రీ హేమలంబసం॥ శ్రావణ శు॥ ప్రథమ 1957 జూలై 28 ఆదివారం ఆ॥ ప్రథమ 6-31 ద్వితీయ రా 3-41 ఆశ్లే 16-46 వర్జ్యం 6-54 ల 8-18 వ వర్జ్యం రా 8-22 ల 4-47 వ.
శు॥ తృతీయ జూలై 29 సోమవారం పూ॥ తృతీయ 28-7 మఘ 18-59 వర్జ్యం 21-7 ల 22-33 వ.

ఆంధ్రపత్రిక

ఒకటే యిది యెవరెంచిన
వరవర యుక్తియయు వర మనంబున కను రా
గొరులకు వదిపేయుటయిది
వరాయుటయు వరవరర్వ వరమంతెల్లన్
(మహాభారతము)

శ్రీ హేమలంబసం॥ శ్రావణ శు॥ ప్రథమ
ఆదివారం

## తంతీ - తపాలాశాఖ ఉద్యోగుల బాధ్యత

తంతీ తపాలా పనివారి సమ్మె నిర్ణయాన్ని మార్పించడానికి ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ చేసిన ప్రయత్నం విఫలమైంది. ఆగస్టు 8-9 నుంచి సమ్మె ప్రారంభించాలని లోగడ చేసిన నిర్ణయంలో మార్పేమీ లేదని శాఖ్యాచరణసంఘంవారు ప్రకటించారు. ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూతోనూ, కేంద్ర కార్మిక మంత్రి శ్రీ గుల్జారీలాల్‌నందాతోను తంతీ తపాలా శాఖోద్యోగుల ప్రతినిధులు జరిపిన సంప్రతింపుల వివరాలు కొంత వరకు వెల్లడి అయినవి. ప్రధాన మంత్రీ, కార్మికశాఖా మంత్రీ కూడా పనివారి కోరికలను మన్నించడానికి గల అవకాశాలను సానుభూతితో, శ్రద్ధగా పరిశీలించినట్లు స్పష్టమైనది. కేంద్ర ప్రభుత్వోద్యోగుల జీతాల పరిశీలనకు ప్రభుత్వం నియమింపదలచిన సంఘాన్ని "వేతన నిర్ణాయక సంఘం" అని పేర్కొనడానికి అభ్యంతరంలేదని శ్రీ నెహ్రూ ప్రకటించారు. కరువు భత్యాన్ని జీతంలో కలిపే విషయాన్ని ఇప్పటి కరువుభత్యాన్ని వెంటనే పెంచే విషయాన్ని గురించి ఉద్యోగుల ప్రతినిధుల కోర్కెలను ప్రధాన మంత్రి అంగీకరింపలేక పోయినారు. కాని సంప్రతింపులలో పాల్గొన్న కార్మికశాఖా మంత్రి శ్రీనందా ఉద్యోగులు కోరుతూ వున్న ఎక్కువ కరువుభత్యం విషయాన్ని 'వేతన సంఘానికి' నివేదింపగలమని చెప్పారు. ఈ సూచనను ఉద్యోగుల ప్రతినిధులు అంగీకరింపలేదు.

ఈ సంప్రతింపుల ధోరణి వల్ల స్పష్టమవుతున్న విషయం ఒక్కటే. ప్రభుత్వం తమ షరతులను అంగీకరిస్తేనే తంతీ తపాలా సంఘం ప్రతినిధులు రాజీకి సిద్ధం. వీరి షరతులను ప్రభుత్వం అంగీకరింప గల స్థితిలో వుంటే ఈ సంప్రతింపులే అవసరంలేదు. ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ సమాధాన ధోరణిలో వున్నారని శ్రీ దాల్వీ సుస్తించారు. కేంద్రవేతనసంఘు ప్రతిపాదనల ప్రకారం కరువు భత్యాన్ని హెచ్చించడం గురించే తాము ఏమీ చేయలేని స్థితిలో వున్నట్లు ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ ప్రకటించారని శ్రీ దాల్వీ వెల్లడించారు. తంతీ తపాలా సిబ్బంది నాయకులు రాజీ మార్గాన్ని అన్వేషించడానికి గాక, వారి కోరికలకు ప్రధాన మంత్రి అంగీకారాన్ని పొందడానికే ఈ సమాలోచనల్లో పాల్గొన్నట్లు కన్పిస్తుంది. తాత్కాలిక సహాయం గురించికూడా ప్రభుత్వం నియమింప నున్న సంఘం విచారింప గలదని శ్రీ నందా హామీ నిచ్చిన తరువాత, జీతంలో కరువుభత్యాన్ని చేర్చే ఒక్క విషయం మీదనే ప్రభుత్వ వైఖరి ఉద్యోగులకు తృప్తికరంగా లేదని స్పష్టమౌతున్నది. ఈ విషయం వెంటనే పరిష్కారం కానందువల్ల ఉద్యోగులకు ఇప్పుడు కలిగే నష్టం ఏమీ లేదు. ఈ సమస్యా పరిష్కారానికి సమ్మె చేయవలసిన అవసరం లేదు. సమ్మె చేస్తేగాని ఈ సమస్య పరిష్కారం కాదనే ఉద్యోగుల ప్రతినిధుల అభిప్రాయం సహేతుకంగా లేదని చెప్పక తప్పదు. జీతాల్లో కరువు భత్యం కలిపే వ్యవహారం ఒక్క ప్రభుత్వోద్యోగులకు మాత్రమే సంబంధించింది గాదు. ప్రభుత్వోద్యోగుల్లో అయినా తంతీ తపాలాశాఖ ఉద్యోగులకు మాత్రమే సంబంధించిందిగాదు. ఈ పరిస్థితులలో ఆగస్టు 8-9 అర్థరాత్రినుంచీ తంతీ తపాలా పనివారు సమ్మె ప్రారంభిస్తే ఆ సమ్మె విఫలం కావచ్చును. ప్రజల సానుభూతిని ఇంతవరకూ ఈ ఉద్యోగులు పొందలేకపోయినారు. ఇంతవరకూ ప్రభుత్వం కూడా వీరి కోరికలను కొంత సానుభూతితో పరిశీలిస్తూ వున్నది. ప్రధాన మంత్రితో జరిపిన సంప్రతింపులు విఫలం కావడంవల్ల ప్రభుత్వం సమ్మెదారుల విషయంలో కఠినమైన చర్యలను తీసుకొనక తప్పదు. ఉద్యోగులు సమ్మెను ప్రారంభించిన తరువాత రెండు పక్షాలకూ ప్రతిష్ఠ అడ్డువచ్చి విషయాలను స్థిమితంగా పరిశీలించడానికి అవకాశం లేకుండా పోతుంది. సమ్మెను ఎప్పుడైనా ప్రారంభింపవచ్చును. సమ్మెను ప్రారంభించే లోపున, ఈ వ్యవహారంపై తిరిగి సంప్రతింపులను జరిపి సమ్మె అవసరం లేకుండా ఈ సమస్యలు ఎంతవరకు పరిష్కారం కాగలవో తెలుసుకోవడం అవసరం.

## జర్మనీ ఏకీకరణ
### పశ్చిమరాజ్యాల విధానం వివరిస్తూ 29 న ప్రకటన

పారిస్, జూలై 26: జర్మనీ ఏకీకరణపట్ల బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, పశ్చిమ జర్మనీల విధానం వివరించే ప్రకటనపై జూలై 29 వ తేదీ మధ్యాహ్నం బెర్లిన్‌లో సంతకాలు జరుగుతవని ఫ్రెంచి ప్రభుత్వ విదేశాంగశాఖ నేడు వెల్లడి చేసినది.

జర్మనీ ఏకీకరణ విషయంలో ఈ నాలుగు దేశాల ప్రభుత్వాలు సంయుక్తంగా అనుసరించే విధానాన్ని ఆ ప్రకటనలో 12 సూత్రాలద్వారా వివరించడం జరుగుతుంది. పశ్చిమ జర్మనీ విదేశాంగమంత్రి శ్రీ హెన్రిక్ వాన్ బ్రెంటానో, పశ్చిమ జర్మనీలోని ఫ్రెంచి, బ్రిటిషు, అమెరికా సంయుక్తరాష్ట్రాల రాయబారులు సంతకాలు చేస్తారు.

ఆ సందర్భంలో నాలుగు రాజ్యాల ప్రకటన ప్రాధాన్యమును, వైశిష్ట్యమును వివరిస్తూ శ్రీ బ్రెంటానో ప్రసంగిస్తారని కూడా ఫ్రెంచి ప్రభుత్వం వెల్లడిచేసినది. రాయబారులు కూడా తమ ప్రభుత్వాల తరఫున ప్రసంగిస్తారు. ఈ ప్రసంగాలు రేడియోలోను, టెలివిజన్ ద్వారాను ప్రసారం చేస్తారు.

జర్మనీ ఏకీకరణ విషయమై వాషింగ్టన్‌లోను, పారిస్‌లోను ఈ నాలుగు ప్రభుత్వాల మధ్య సంప్రతింపులు జరుగుతున్నవి.

## నేపాల్‌లో నూతన మంత్రివర్గం
### సింగ్ ప్రధానిగా ఏర్పాటు

ఖాట్మండు, జూలై 26: ఐక్యప్రజా స్వామ్యపక్షం నాయకుడు డాక్టర్ కె. ఐ. సింగ్ ప్రధానిగా నేపాల్‌లో నూతన మంత్రివర్గం ఏర్పాటయింది.

ఈ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసినట్లు నేపాల్ రాజు మహేంద్ర ప్రకటిస్తూ, అందరి సహకారాన్నీ అభ్యర్థించారు. వివిధ రాజకీయపక్షాలలోను పరస్పర సహకారం లేనందుకు ఆయన విచారం తెలిపారు. ఈమంత్రివర్గంలో మరి పదిమంది సభ్యులున్నారు. రాజభవనంలో జరిగిన ప్రత్యేక దర్బారులో వీరు ప్రమాణం స్వీకరించారు.

గత ఏడుసంవత్సరాలలోను ఏర్పడిన మంత్రివర్గాల్లో ఇది ఆరవది.

# ఓమాన్‌పై విమానదాడుల నిలుపుదల
## బ్రిటిష్ ప్రకటన: సైనిక చర్యలకు సన్నాహం
### రెండు నగరాలు పూర్తిగా ధ్వంసమైనట్లు ఇమాం కైరో కార్యాలయ ప్రకటన

నజ్వా, జూలై 26: ఓమాన్ జాతి వారి కేంద్రాలపై మూడురోజుల దాడి అనంతరం, ఇంక విమానదాడులను నిలిపి వేస్తున్నట్లు, ఇక్కడి రాయల్ విమానదళ కార్యాలయం ఇవాళ ప్రకటించింది.

ఇంక మస్కాట్ సుల్తాన్ సైన్యాలను ఓమాన్ కోటల ఆక్రమణకు నడిపే విషయమైనన్నాహాలు జరుగుతున్నాయి.

మూడురోజులు రాయల్ (బ్రిటిష్) విమానాలు నిజ్వా, ఇజ్కి, తానుఫ్ కోటలపై రాకెట్లు, ఫిరంగులు ప్రయోగించాయి.

తానుఫ్ కోటపై దాడి ఇవాళే జరిగింది. ఇది నిజ్వాకు ఏశాన్యదిశగా త్రోవ ఉంది.

ఇంక ఈ ప్రాంతమంతటా బ్రిటిష్ విమానాలు కరపత్రాలువెదజల్లుతాయట. సుల్తాన్‌పక్షాన చేరి విధేయతతో ఉండాలని ఓమాన్ జాతీయులకు ఈ పత్రాల ద్వారా హెచ్చరిస్తారు.

సుల్తాన్ సైన్యాలను ఈ కోటలవద్దకు నడిపించే విషయంలో అప్పుడే బ్రిటిషు ప్రతినిధి సర్ బెర్నార్డ్ బరోస్, మస్కాట్ సుల్తాన్‌లు ఒక కార్యక్రమమునకు అంగీకారానికి వచ్చినట్లు, బ్రిటిషు వైమానికాధికారి చెప్పారు.

ఇజ్కి కోట చుట్టుపక్కల ఎక్కడా సైన్యాలకదలిక కనపడటం లేదు, కాని, కోటపై ఇమాం శ్వేతపతాకం స్థానే, ఇవాళ సుల్తాన్ ఎర్రపతాక బ్రిటిషు వైమానికుల కంట పడిందట. సుల్తాన్ సైన్యం ఇంకా ఇక్కడికిదూరంలోనే ఉంది.

ఎలా ఉన్నప్పటికీ, హంగరీలో రష్యా జోక్యం గురించి సమితి ఉపసంఘ నివేదికపై చర్చకోసం సన్నాహం చేస్తున్న వారికి, ఇప్పుడు బ్రిటన్ జోక్యం కలవరపాటు కలిగిస్తున్నది. స్థానికకలహాలలో ఇతర రాజ్యాలు కలుగచేసుకోడం ఆక్రమం అని సిద్ధాంతీకరించి ఉపన్యాసాలివ్వాలని సిద్ధపడుతున్న వారి కిది గొంతుకలో పచ్చివెలగపడినట్టుంది.

బ్రిటన్ ఇలా జోక్యం చేసుకొని ప్రమాదకరమైన సంప్రదాయం స్థాపిస్తున్నదని, ఇక్కడ ఒక తటస్థరాజ్య ప్రతినిధి అన్నారు.

మతం పేరు చెప్పి లేదా మరో పేరు చెప్పి తనకు సహాయం చెయ్యాలని ఇమాం అరబ్ రాజ్యాలను కాని, ఇతర రాజ్యాలను కాని అడిగితే ఇప్పుడేమౌతుంది? ఈ చిన్న కలహం కాస్తా పెద్ద యుద్ధంగా పరిణమిస్తుంది.

ఈ సందర్భంలో ఈ ప్రతినిధి, క్రిందటేడు ఈజిప్టుతో యుద్ధం మానకపోతే రష్యా స్వచ్ఛంద సైనికులనుపంపగలదని హెచ్చరించిందన్నమాట గుర్తుకు తెచ్చారు.

ఓమాన్‌కు రహస్యంగా ఆయుధాలేవీ చేరకుండా కట్టుదిట్టం చెయ్యగలరని బ్రిటిష్ విదేశాంగమంత్రి మొన్న కామన్సు సభలో అన్నారు. దీని అర్థం వేరే చెప్పనక్కరలేదు. సౌదీ అరేబియా, ఓమాన్ సరిహద్దులు మూసివెయ్యాలనే వారి ఉద్దేశం. అమెరికాకు సౌదీఅరేబియాకు మైత్రి మాత్రమే కాదు, పెట్రోల్ పరిశ్రమవల్ల తెగని అనుబంధం ఉంది. అందువల్ల జోర్డానులో క్లిష్ట పరిస్థితి ఏర్పడినప్పుడు అమెరికా తన అరబ నాకా దళాన్ని పంపినట్లు ఇప్పుడు సౌదీఅరేబియాకు విరుద్ధంగా చర్యతీసుకోడం అసంభవం. కాగా, ఓమాన్ పరిస్థితి గురించి అమెరికా వైఖరి ఏమిటో స్పష్టంగా తేల్చాలని సౌదీ అరేబియా ఇప్పుడు పట్టుపట్టవచ్చు.

## రెండు నగరాల పూర్తి విధ్వంసం
### ఓమాన్ ఆరోపణ: బ్రిటిష్ నిరాకరణ

కైరో, జూలై 26: బ్రిటిష్ విమాన దాడుల మూలంగా నిజ్వా, ఇజ్కి నగరాలు రెండూ పూర్తిగా నేలమట్టమైనాయని కైరోలోని, ఓమాన్ఇమామ్ సమాచారకార్యాలయం తెలుపుతున్నది.

దాడులలో గాయపడినవారు, నివాసాలు కోల్పోయినవారికి సహాయం చెయ్యవలసిందని శాంతి కాంక్షాపరులైన ప్రజలకు, ముఖ్యంగా ఇస్లాం జాతీయులకు డిప్యూటీఇమాం విజ్ఞప్తిచేశారు.

నిజ్వా, ఇజ్కినగరాలు పూర్తిగా విధ్వంసమైనాయనే వార్త అబద్ధమని, బ్రిటిషు విదేశాంగ కార్యాలయం లండనులో ప్రకటించింది.

బ్రిటిష్‌విమానాలు ఆ నగరాలలో, సైనిక నిలయాలైన కోటలపైన మాత్రమే రాకెట్లు, ఫిరంగులు ప్రయోగించాయట. చివరకు కోటల పొరుగులోవున్న నివాస భవనాలకుకూడా నష్టం కాకపోవటాడా వాటిల్లలేదని, బ్రిటిష్ విదేశాంగశాఖాధికారి ఒకరు అన్నారు.

ఇమాం ప్రతినిధులు, మస్కాట్ సుల్తాన్ ప్రతినిధులు కలుసుకున్నప్పుడు కొన్ని సంఘటనలను గురించి ప్రచారమైన వార్తలుకూడా కల్పితాలే అని వీరన్నారు.

### "చిన్న ఎత్తులో చర్య"

వాషింగ్టన్, జూలై 26: ఓమాన్ తిరుగుబాటు "చిన్న ఎత్తులో చర్య" మాత్రమే అని ఇవాళ అమెరికా విదేశాంగశాఖాధికారి శ్రీ లింకన్ వైట్ వ్యాఖ్యానించారు.

ఓమాన్‌ప్రాంతంలో ఇతర దేశాల ఆయుధసామగ్రి చేరిన వార్తలేవీ అమెరికాకు చేరలేదని వారన్నారు.

ఈ చిక్కులన్నీ త్వరలోనే పరిష్కారం కాగలవని అమెరికా ఆశిస్తున్నదన్నారు.

## బ్రిటన్ జోక్యంలో న్యాయాన్యాయాలు
### సౌదీఅరేబియా వైఖరి గురించి ఊహాగానాలు

కైరో, జూలై 26: ఓమాన్ తిరుగుబాటు అణచడానికి మస్కాట్ సుల్తాన్‌తో మైత్రి సంధి సాకు తెచ్చి, బ్రిటన్ తన చర్య సమర్థించుకోడానికి చేస్తున్న ప్రయత్నాన్ని, ఐక్యరాజ్య సమితి సంప్రదాయాల దృష్ట్యా అంతర్జాతీయ న్యాయం దృష్ట్యా కొందరు పరిశీలిస్తున్నారు.

మస్కాట్ సుల్తాన్‌తో బ్రిటన్ చేసుకున్న మైత్రిసంధి ప్రకారం, సైనికసహాయం ఇవ్వవలసిన బాధ్యత ఉన్నదా, అనే ప్రశ్నకు బ్రిటిషు విదేశాంగమంత్రి శ్రీ సెల్విన్ లాయిడ్ కామన్సు సభలో సరైన జవాబివ్వకుండా సందిగ్ధంగా వివిధించి వేశారు.

అంతర్జాతీయ న్యాయం, నీతిమాటలు...

## ట్యునీషియా రాజ్యాంగం
### అమెరికా పద్ధతి అమలు జరిగే సూచన

ట్యూనిస్, జూలై 26: ట్యునీషియాకు మొదటి అధ్యక్షుడుగా ఏకగ్రీవంగా ఎన్నికైన శ్రీ హబీబ్ బోర్గీబా రాజ్యాంగ లాంఛనాలతో నిమిత్తం లేకుండానే అధ్యక్షపదవి స్వీకరించారు.

ట్యునీషియా మంత్రివర్గం యివాళ రాజీనామాను శ్రీ బోర్గీబాకు అందచేసింది. నిన్న టివరకూ ప్రధానమంత్రిగ ఉన్న శ్రీ బోర్గీబా, అధ్యక్షపదవిని స్వీకరించినప్పటికీ, ప్రస్తుతానికి ప్రధాన మంత్రి పదవిని వారే నిర్వహిస్తారనీ, కొన్ని అధికారాలను బాధ్యతలను మాత్రం ఉపప్రధాని శ్రీ బహీలడ్డమ్‌కు అప్పగిస్తారనీ తెలుస్తున్నది. మంత్రివర్గములో కూడా కొన్నిమార్పులు జరుగుతాయట. కొత్త మంత్రివర్గ నిర్మాణం రాజ్యాంగ పరిషత్తు ఆమోదం పొందవలసి ఉంటుంది.

రాజ్యాంగ రచన ఇంకా పూర్తి చెయ్యని రాజ్యాంగ పరిషత్తు, అమెరికాలో అమల్లో ఉన్న రాజ్యాంగవిధానాన్ని తయారు చెయ్యవచ్చునని తెలుస్తున్నది. అంటే అధ్యక్షునికే పరిపాలనాధికారం కూడా వుంటుంది.

నిన్న రాత్రి అంతా ట్యూనిస్ నగరవాసులు రిపబ్లిక్ స్థాపనకు ఆనందసూచకంగా ఉత్సవం, ఊరేగింపులు జరుపుకున్నారు.

మొన్నటివరకూ "బే" (సుల్తాన్) పదవిలో ఉన్న శ్రీ సిదీలామీన్, యువరాజు, ఇతర పుత్రులు మున్నరు, అల్లుడు కూడా ట్యూనిస్‌కు కొద్దిదూరంలో గల భవనాలలో నిర్బంధంలో వున్నారు. వారి భవనాల చుట్టూ రాత్రింబవళ్ళు పహరా ఏర్పాటయింది.

ట్యునీషియాలోని రాయబారు లందరికీ ఉపప్రధాని నిన్న రాత్రి తమరాజ్యం రాజరికం నుంచి గణతంత్ర రాజ్యంగా మారిందని అధికారికంగా తెలియపరచారు.

## గ్రహాల మధ్యకు పంపే రాకెట్లు
### తనిఖీ ఉండాలని అమెరికా సూచన

లండన్, జూలై 25: విశ్వాంతరాళంలో గ్రహాల మధ్య ప్రయాణానికి పంపే రాకెట్లు శాంతి ప్రయోజనాలకు, శాస్త్రపరిశోధనకే గాని, ఇతర ప్రయోజనాలకు పంపడం లేదని నమ్మకం కుదుర్చుకోడానికి తనిఖీ పద్ధతికి కూడా నిరాయుధీకరణ తొలి ఒప్పందంలో ఏర్పాటు ఉండాలని, అమెరికన్ ప్రతినిధి శ్రీ హెరాల్డ్ స్టాసెన్ ఇవాళ సమితి నిరాయుధీకరణ ఉపసంఘంలో ప్రతిపాదించారు.

తనిఖీ విధానంగా జరగాలో, తొలి ఒప్పందం కుదిరిన మూడు మాసాలలో వివిధ దేశాల నిపుణులు నిర్ణయించాలని వీరు సూచించారు.

శ్రీ స్టాసెన్ ఇవాళ రాకెట్లు, చోదిత అస్త్రాలను గురించి కూడా మాట్లాడారట.

భూమినుంచి దూరాలకు అస్త్రాలను పంపేవి అన్నీ సైనికావసరాలకు కాదని నిర్ధారణ లేకపోతే, అన్ని రాజ్యాలకూ ప్రమాదమే అని శ్రీ స్టాసెన్ అన్నారట. అందువల్ల దీనిపై కూడా ఇప్పుడే ఒప్పందం కుదరాలన్నారు.

### అణుశక్తితో నడిచే జలాంతర్గామి

లండన్, జూలై 25: అణుశక్తితో నడిచే జలాంతర్గామి "నాటిలియస్" నిర్మాణం గురించి అమెరికా తన రహస్యాలను బ్రిటన్‌కు చాలా తెలియపరిచిందని, బ్రిటిషు అణుశక్తి సంస్థ ప్రధాన నిర్వాహకుడు సర్ ఎడ్విన్ ప్లాడెన్ పత్రికా సమావేశంలో తెలిపారు.

అయితే ఇన్ని రహస్యాలు ఇంత సమాచారం అమెరికా అందించినా, బ్రిటన్ తన అణుశక్తి జలాంతర్గామిని నిర్మించుకోడానికి స్వయంగా పరిశోధన జరుపుకోక తప్పదని చెప్పారు. ఈ జలాంతర్గామి నిర్మాణం అయినప్పుడు దానిని ఎలా నడపాలో శిక్షణ బ్రిటన్ తన నావికులకు ఇచ్చుకోవాలి.

ఇటీవల బ్రిటన్ పరీక్ష చేసిన ఉదజని బాంబువల్ల అణురజ వ్యాప్తి వైద్య పరిశోధక మండలి వేసిన అంచనాకంటె బాగా తక్కువే కనపడిందని, అణుశక్తి పరిశోధకశాఖ ప్రధాన అధికారి సర్ జాన్ కాక్రాఫ్ట్ చెప్పారు.

### ప్రమాదంకంటె భయం ఎక్కువ

లండన్, జూలై 26: అణ్వస్త్రాల రేడియో ధార్మికశక్తివల్ల నిజంగా సంభవించే హానికంటె, హాని కలుగుతుందనే భీతి వ్యాపించడంమూలానే, ప్రపంచంలో సగంమందికి మతి స్థిరంపోతుందా, అనిపిస్తుంది, అని, బ్రిటిష్ వైద్యసంఘం పత్రికలో జనిశాస్త్రజ్ఞుడు డాక్టర్ రోజర్ పెన్నింగ్‌టన్ వ్రాస్తున్నారు.

రేడియో ధార్మికశక్తిని ఎలుకలపైనా మొక్కలపైనా, ప్రసరింపచేసి చూసిన ఫలితాలు మానవులకు కూడా కలుగుతాయని ఇంతవరకూ నిర్ధారణ కానేలేదని వీరన్నారు.

ఈనాటివరకు ఏ భౌతిక శాస్త్ర విషయంపైనా శాస్త్రజ్ఞులే ఇంతఅయోమయంగా తికమకలుపడడం జరగలేదు.

భయం విడిచిపెట్టి క్రమంగా పరిశోధన జరిపితే, చివరకు ఈ భయం అంతా అనవసరంఅని తేలినా తేలవచ్చునని వీరి అభిప్రాయం.

కాని పరిశోధన కంటె భయం అధికంగా ప్రపంచంలో వ్యాపిస్తోంది. కొందరు ఏ కొత్త తలనొప్పి వచ్చినా, హిరోషిమా ప్రజలకు వచ్చిన జబ్బు లాటిదేదో వచ్చిందని హడలిపోడం చూస్తే, కొద్దిరోజుల్లో ప్రపంచంలో సగం జనాభాకి మతి స్థిరం తప్పిపోతుందా, అనిపిస్తుంది అని వీరు వ్రాశారు.

## ఆసియా ఆఫ్రికాలలో జాతీయ వాదం
### బ్రిటిష్ ప్రధాని వ్యాఖ్య

లండన్, జూలై 26: ఆసియా ఆఫ్రికా ఖండాలలో జాతీయవాదం కొలదిసంవత్సరాల క్రిందట ఒక చిన్న అలగా ఉన్నది విజృంభించి ఈనాడు ఉవ్వెత్తుగా పొంగిన సముద్రకెరటంగా రూపొందినదని బ్రిటిషు ప్రధానమంత్రి శ్రీ హెరాల్డ్ మాక్మిలన్ నేడు ఇక్కడ చెప్పారు. "ఈ జాతీయవాద ప్రవంతి సవినాశము, సరళము తమ అయిన మార్గాలలో ప్రవహించేటట్లు చేయడం ఆవశ్యకం. లేకపోతే జాతీయవాదం కమ్యూనిజంగా మార్పు చెందుతుంది" అని ఆయన హెచ్చరించారు. అమెరికా న్యాయవాదుల సంఘ సమావేశంలో ప్రసంగిస్తూ శ్రీ మాక్మిలన్ పై విధంగా చెప్పారు.

ఇటీవలజరిగిన కామన్వెల్తు రాజ్యాల సమావేశం విలువ గురించి సూచిస్తూ శ్రీ మాక్మిలన్ ఇలా అన్నారు: "మేము చాల వేగంగా ముందుకు సాగిపోతున్నామని భావిస్తున్నవారు కొందరు ఉన్నారు.

"తన సామ్రాజ్యంలో చేరిన అన్ని ప్రాంతాలకు సంపూర్ణ స్వాతంత్ర్యం తనంతట తానే ఇవ్వడానికిపూనుకొన్న ఏకైక దేశం బ్రిటన్. ఇతర ప్రాంతాలలో జరుగుతున్న దానితో పోల్చితే, మేము సామ్రాజ్యవాదులమంటూ మాపై దాడిచెయ్యడం ఎంత మూర్ఖమో ఎంత కపటమో కూడినదో స్పష్టం అవుతుంది."

## రాకెట్ల అదుపుకు అమెరికా ప్రతిపాదన
### బ్రిటన్ ఫ్రాన్సుల మద్దతు

లండన్, జూలై 26: భూగోళం పరిధులను దాటి విశ్వాంతరాళానికి పంపే రాకెట్లు, కేవలం భౌతికశాస్త్ర పరిశోధనకు, శాంతి అవసరాలకు మాత్రమే పంపేలా కట్టుదిట్టం చెయ్యడానికి, నిన్న అమెరికా ప్రతినిధి శ్రీ స్టాసెన్ సమితి నిరాయుధీకరణ ఉపసంఘంలో చేసిన ప్రతిపాదనను ఇవాళ బ్రిటిష్, ఫ్రెంచి ప్రతినిధులు బలపరుస్తూ మాట్లాడారు.

బ్రిటిష్ ప్రతినిధి కమాండర్ అలన్ నోబుల్ మార్చి 18 న, ఏప్రిల్ 20 న రష్యా ప్రతిపాదించిన సూచనలు బ్రిటన్‌కు సమ్మతం కావని స్పష్టపరిచారు.

ఈ రాకెట్లను, చోదిత అస్త్రాలను అణ్వస్త్రాలతోపాటే నిషేధింపవచ్చునని, ముందు అణ్వస్త్రపరీక్షలను నిషేధించాలనీ రష్యా వాదం.]

రాకెట్లు అంటే రెండో ప్రపంచ యుద్ధంలో లండన్ నగరం ఒక్కటే నుసైన జర్మన్ "వి 2" రాకెట్లవంటివి కావు, అని శ్రీ నోబుల్ అన్నారు. ఇప్పుడు తయారవుతున్న రాకెట్లతో పోలిస్తే అవి రాతియుగపు ఆయుధాలవంటివి అనుకోవచ్చు. ముమ్ముందుతయారయ్యే రాకెట్లు ఇప్పటివానికంటె భయంకరంగా ఉంటాయి. అటువంటి భయంకరమైన అస్త్రాలనుంచి ఏదేశానికి రక్షణ ఉండదు. అందువల్ల రాకెట్ల అభివృద్ధి నిర్మాణం యుద్ధావసరాల కోసం జరగకుండా కేవలం శాంతి అవసరాలకే జరిగేటట్లు చూడవలసిన బాధ్యత అందరిపైనా ఉంది. కాబట్టి నిరాయుధీకరణ ఒప్పందం ఈ తొలి దశలోనే దీనిపైకూడా ఒప్పందం కుదరాలని శ్రీ నోబుల్ అన్నారు. లేని పక్షంలో తొలిఒప్పందం ఒకటే కుదిరినప్పటికీ యుద్ధపురాకెట్ల నిర్మాణం ఆగకుండా సాగిపోతుంది, అన్నారు.

ఫ్రెంచి ప్రతినిధి శ్రీ జూల్స్‌మాచ్ కూడా అమెరికా ప్రతిపాదనను బలపరిచారు.

అమెరికన్ ప్రతిపాదనలను ఒక్కొక్కటిగా రెండుమాసాలనుంచీ వివరిస్తున్న శ్రీ స్టాసెన్‌ను ఇంకెన్నిరోజులు పట్టుకుంటుందని రష్యాప్రతినిధి శ్రీ జోరిన్ అడిగారు. శ్రీ స్టాసెన్ ఇదమిత్థంగా చెప్పలేదు కాని, వైవారంలో పూర్తి కావచ్చునని మాత్రం అన్నారు.

అమెరికా ఇంకా వైమానిక పరిశీలన గురించి ప్రతిపాదన వివరించవలసిఉంది. ఈ పరిశీలన ఏర్పాటయ్యే ప్రాంతాన్ని చెందిన ఉత్తర అట్లాంటిక్ కూటరాజ్యాలతో సంప్రదిస్తున్నందువల్ల జాప్యమయిందని శ్రీ స్టాసెన్ చెప్పారు.

నిరాయుధీకరణ సంఘానికి ఆగస్టు 1 లోగా నివేదిక పంపవలసి ఉన్నందువల్ల, ఉపసంఘం నివేదికను చర్చించడానికి సోమవారం సమావేశ మారుతున్నది. తరువాత తిరిగి చర్చ మంగళవారంనాడు ప్రారంభమౌతుంది.

## ద్వితీయ బాండుంగ్ సమావేశం

మాస్కో, జూలై 26: బాండుంగ్ రాజ్యాల ద్వితీయ సమావేశం 1958 సెప్టెంబరులో జరుగుతుందని భావిస్తున్నానని ఇండోనీషియా సమితి ప్రతినిధి శ్రీ అలీశాస్త్రోమిజోయో అన్నారు. ఇందుకు తగిన సమయాన్ని అన్ని రాజ్యాలు అంగీకరించవలసి ఉందన్నారు. ఈయన రష్యా పర్యటన కపటితో ముగుస్తుంది.

## రష్యానుండి తిమ్మయ్య ప్రయాణం

మాస్కో, జూలై 26: రష్యాలో పదిహేను రోజులపాటు పర్యటించిన భారత సర్వసేనాని శ్రీ తిమ్మయ్య, ఆయన బృందము నేడు తిరిగి స్వదేశానికి ప్రయాణ మయ్యారు. విమానాశ్రయంలో రష్యా రక్షణమంత్రి మార్షల్ ఝుకోవ్, ఇతర ఉన్నతాధికారులు వీరికి వీడ్కోలు ఇచ్చారు.

## వచ్చే నెలలో లండన్‌కు ప్రయాణం

వచ్చేనెల నాలుగవ తేదీకి శ్రీ తిమ్మయ్య లండన్ చేరుతారు. ఈయనతో భారత సైనిక ఆయుధ నిర్మాణ శాఖాధిపతి శ్రీ యల్. పి. సేన్ కూడా వస్తారు.

## చైనాకు, భారత్‌కు సభ్యత్వం

లండన్, జూలై 25: ఐక్యరాజ్యసమితి భద్రతామండలిలో చైనాకు, భారత దేశానికి విధిగా స్థానం వుండాలని బ్రిటిషు పార్లమెంటు ప్రభువుల సభలో మాట్లాడుతూ, ఎరల్ అట్లీ సూచించారు.

"విశాలమైన దేశాలను, విశాలమైన దేశాలవారికే మనుష్యులుగాని, ఇతరులు కారన్న ఒక భావనవుంది. ఇది పోవాలి" అని కూడా ఆయన అన్నారు.

కొలంబో, జూలై 25: సింహళ భాషా సమస్యపై తమిళుల హక్కులను సమర్థిస్తూ ఆగస్టులో తలపెట్టిన శాసనోల్లంఘనోద్యమాన్ని విరమిస్తూ ఫెడరల్ పార్టీ నాయకులు ప్రకటించారు. ప్రధాని బండారు నాయకేతో వీరు ఆరుగంటలపాటు జరిపిన చర్చల ఫలితంగా వెలువడిన సంయుక్త ప్రకటనలో ఈ విషయాన్ని పేర్కొన్నారు.

## తూర్పు పాక్ మంత్రి బర్తరఫ్
### ఢక్కాలో 144 వ సెక్షన్ అమలు

ఢక్కా, జూలై 26: తూర్పు పాకిస్థాన్ మంత్రివర్గం నుండి మహమ్మద్ అలీని గవర్నరు బర్తరఫ్ చేశారని ప్రభుత్వ ప్రకటన వెలువడింది. ముఖ్య మంత్రి అతాపూర్ రహమాన్‌ఖాన్ సలహాపై ఈయనను గవర్నరు తొలగించారు.

తమను తొలగించాలనే నిర్ణయం జరగడానికి ముందే తను గవర్నరు మంత్రి పదవికి రాజీనామా ఇచ్చానని శ్రీ అలీఅన్నారు. ఈయన గణతంత్ర దళ నాయకుడు. జాతీయ పక్షంతోను, అవామీలీగ్‌లోని భషానీ వర్గంతోను కలిసి ఈపక్షం నిన్నసే నూతన రాజకీయ పక్షాన్ని ఏర్పాటు చేసింది.

ఢక్కాలో నేడు 144 వ సెక్షను అమలుపరచారు. ఏర్పడిన పాకిస్థాన్ జాతీయ అవామీపక్షం నిన్న సాయంకాలం జరిపిన బహిరంగసభను పాడుచేయాలని కొంతమంది ఆయుధాలతోను, లాఠీలతోను హింసాత్మక చర్యలకు పూనుకున్నారు. వీరు సభలోనికివెళ్ళి, యథేచ్ఛగా లాఠీలను ప్రయోగించారు. పన్నెండుమంది ప్రజలు గాయపడ్డారు. సభికులపైరాళ్లు కూడా రువ్వారు. పోలీసులు విష వాయువును ప్రయోగించి, అల్లర్లను అణచారు. పదమూడుమందిని అరెస్టు చేశారు.

సమావేశప్రారంభంలో కురాన్ పఠనసమయంలో అల్లర్లు ప్రారంభమయ్యాయి. 144 వ సెక్షన్ అమలు పరిచినట్లు ప్రకటనజరగగానే, అవామీ ధాన్యాలను ప్రభుత్వం అదుపులోనికి తీసికొనిరావాలనే ఒకతీర్మానం, నిషేధం ఈ తీర్మానం ఖండిస్తూ మరోతీర్మానం చేశారు: శాసీ చర్యలను తొలగించాలని కుండా, ప్రజలు తిమక ర్తవ్యాన్ని నెరవేర్చాలని ప్రబోధిస్తు తీర్మానం వహించిన భాషానీ కోరారు. అంతప్రజలు మాను లాగా ప్రార్థనలలో పాల్గొన్నారు. ప్రదర్శకుల శాంతిచర్యలు మాత్రం తగ్గలేదు. భషానీ, అబ్దుల్‌గఫార్‌ఖాన్ ప్రభృతులపై రాళ్లువిసిరారు.

## ఆజాద్‌కాశ్మీర్ ఎన్నికలకు అవామీలీగ్ ప్రాతికూల్యం

ఆజాద్ కాశ్మీర్‌లో జరిగే జిల్లాబోర్డుఎన్నికలలో పాల్గొనరాదని అఖిల జమ్ము, కాశ్మీర్ అవామీలీగ్ పక్షం తీర్మానించింది. ప్రస్తుత ఆజాద్ కాశ్మీర్ ప్రభుత్వానికి ఇది వ్యతిరేక పక్షం. నేటిప్రభుత్వాన్ని జిల్లాబోర్డుల ఎన్నికలు ప్రాతిపదికగా ఏర్పాటుచేశారని, ఇది ప్రజాస్వామ్యానికి విరుద్ధమని వీరు తెలిపారు.

## కౌలూన్‌లో చైనీయులపై జులుం
### బ్రిటన్‌కు చైనా అధిక్షేపణ

న్యూఢిల్లీ, జూలై 25: కౌలూన్ లో చైనావారి మీద జులుం సాగించి, వారిని హాంకాంగ్ అధికారులు నానా ఇబ్బందులు పెడుతున్నందుకు, చైనా నేడు బ్రిటన్‌కు అధిక్షేపణను తెలియ జేసింది.

కౌలూన్ చైనీయులమీదహాంకాంగ్ అధికారులు జులుంతో, ఇళ్లు పడగొట్టడం, ఇళ్లల్లోంచి గెంటడం, వారి పొలాలను నాశనం చేయడం మొదలైన పనులన్నీ వున్నాయని ఢిల్లీలోని చైనా రాయబారి కార్యాలయం ప్రకటించింది.

జూన్ 25 నుంచి ఈ జులుం ఇట్లా సాగుతూనే వున్నదని, ఈ జులుంను బ్రిటిష్ ప్రభుత్వము, హాంకాంగ్ అధికారులు, వెంటనే ఆపివేయ్యాలని, బాధితులకు చైనీయులకు పునరావాస సౌకర్యాలను కల్పించాలని చైనా విదేశాంగ మంత్రి బ్రిటన్‌ను కోరుతున్నట్లు కూడా ఈ ప్రకటన తెలియజేస్తున్నది.

## బియ్యానికి బదులు ఆయుధాల సరఫరా
### బర్మాకు చెకోస్లొవేకియా సూచన

రంగూన్, జూలై 25: బియ్యానికి బదులుగా చెకోస్లొవేకియాలో తయారు అయిన 'ఎమ్. ఐ. జి.—15' జెట్ ఫైటర్ విమానాలు, తేలిక బాంబర్ విమానాలు, రవాణా విమానాలు, ఆయుధాలు, మందుగుండు పరికరాలు సరఫరా చేయడానికి సంసిద్ధంగా ఉన్నట్లు ఇక్కడి చెక్ ప్రభుత్వ కార్యాలయం బర్మాప్రభుత్వ రక్షణశాఖకు తెలియపరచినదని ఈరోజున వార్తాపత్రికలలో ప్రచురితమైన వార్తల వల్ల తెలుస్తున్నది.

ఈ వార్తలు గురించి అధికారులు ఏమీ చెప్పడంలేదు.

ఈ సందర్భంలో ఇక్కడి చెక్ ప్రభుత్వ కార్యాలయం శిక్షణార్థులతో క్రిందటి సోమవారంనుంచి రాయబారాలు జరుపుతున్నట్లు పత్రికలు ప్రకటించినవి.

బర్మాప్రభుత్వం ఆసక్తి చూపినదని, త్వరలోనే తమ దేశంనుంచి ఆయుధాలు తీసుకొనివచ్చి చూపడానికి చెక్ ప్రతినిధులు వాగ్దానంచేశారని కూడా ఆ వార్తలవల్ల తెలుస్తున్నది.

# పెట్టుబళ్లు పెరిగినాయి
## ఉత్పత్తి, పొదుపు పెరగలేదు

బొంబాయి, జూలై 26: 1956-57 లో ప్రభుత్వరంగంలోను, ప్రాతిస్విక రంగంలో పెట్టుబళ్లు అధికంగా పెరిగినమాట నిజమే అయినా, ఉత్పత్తిగాని, డబ్బును పొదుపు చెయ్యడంగాని, అంత అధికంగా పెరగలేదని, దేశంలో అవసరాలకుగాని, లేక పెట్టుబడి వ్యయానికి తగినట్లుగాగాని, ఇవి లేవని రిజర్వుబ్యాంకువారు 1956-57 చలామణీ-రాజస్వ నివేదికలో పేర్కొన్నారు.

దేశంలో పెట్టుబడి వ్యయం, లోటు రాజస్వ పద్ధతిని అనుసరించి పెరిగిందని గూడా ఇందులో వారు విశ్లేషించారు. రెండో ప్రణాళిక మొదటి సంవత్సరంలో పెట్టుబడులు ఇట్లాగే పెరిగాయన్నారు.

## విల్వల్లో 219 కోట్లతరుగు

"1955-56 లో కన్నా 1956-57 లో బడ్జెట్లు లోటు 100 కోట్లు అధికంగావుంది. (1956-57 లో లోటు 250 కోట్లు) 1955-56 లో దేశంఆర్థిక స్థితిలో కన్పించిన కష్టాలు, 1956-57 అంతా అట్లాగే వున్నాయి. ఈ కష్టం ముఖ్యంగా విదేశాలకు మనం ఇవ్వవలసిన మొత్తాలలో బాగా కన్పించింది. మన నిల్వలు ఇందువల్ల ఈ సంవత్సరంలో, అందువల్ల, 219 కోట్లు తగ్గిపోయినాయి. అంతర్జాతీయ ద్రవ్యనిధినుండి 55 కోట్లు [illegible] ద్రవ్యాన్ని కొన్న అనంతరం మన నిల్వలు ఇట్లా తగ్గాయంటే, ఆ కష్టం యొక్క స్వరూపం అర్థం అవుతుంది" అని రిజర్వుబ్యాంకు ఇందులో వ్రాశారు.

## ధరలు పెరిగాయి

1955-57 లో ధరలు ఏమీ తగ్గలేదని నివేదికన్నా లోగడ ధరల సూచి 8% పెరిగిందని, నిజము, ఆ క్రిందటి సంవత్సరం కన్నా 13% పెరిగిందంటే, ఈ 6% ఎంత ఎక్కువో తెలుస్తుందని, కార్మికుల జీవిక వస్తువుల ధరల సూచి 7% పెరిగిందని వీరు ఇందులో వివరం చేశారు.

## అధిక కష్టం చిహ్నాలు

"ఈ ధరలు పెరగడం, నిల్వలు తరగడం, దేశం ఆర్థికస్థితి యొక్క కష్టానికి ప్రధాన చిహ్నాలు. ఇప్పుడు వీటి స్థితిని బట్టి చూస్తే ఈ 1956-57 లో, ఆ క్రిందటి సంవత్సరం కన్నా, అధిక కష్టానికి మన ఆర్థికతలోనైందని తెలుస్తుంది. అందువల్ల, ప్రభుత్వం ఈ స్థితిని అరికట్టడానికి అవలంబించే చర్యలు విధిగా గట్టిగా వుండాలి, వున్నాయి గూడాను" అన్నారు.

## పారిశ్రామిక వస్తూత్పత్తి

1956 లో పారిశ్రామిక వస్తూత్పత్తి 1955 నాటికన్నా 9% అధికంగా పెరిగింది. వ్యవసాయ ఉత్పత్తి గూడా 1956-57 లో ఆ క్రిందటి సంవత్సరంకన్నా, కొంత నయంగా వున్నట్లే, ఇంతవరకు తేలిన అంచనాలవల్ల తేలుతోంది. అయితే ఇది అంతా ఇట్లావున్నా, పరిస్థితి కొంచెం విషమంగానే వుంది. 1956-57 లో బడ్జెట్లు లోటుకన్నా, 1957-58 బడ్జెట్టులోటు అధికంగా వుంది. ఈ లోటు 280 కోట్లు అని అంచనా వేశారు.

## జరగవలసిన పనులు

ఈ పరిస్థితులలో రెండో ప్రణాళిక అమలు జరగవలసి వుంది. అది సరిగా అమలు జరగాలంటే దన్ను చేసి, ద్రవ్యోల్బణం ఏర్పడని పద్ధతిలో అప్పులు తీసుకొని వ్యవహారాన్ని నడిపించు కోవలసి వుంటుంది.

## చిన్న మంత్రుల మొదటి సమావేశం

న్యూఢిల్లీ, జూలై 25: కేంద్ర ప్రభుత్వానికి చెందిన ఉపమంత్రులు ఉపమంత్రులు, అంటే మంత్రి మండలి సమావేశాలలో పాల్గొనే అధికారం లేని చిన్న మంత్రులను ఇవాళ మొట్టమొదటిసారిగా ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ సమావేశపరచి, పరిపాలనాంశాలను, ముఖ్యంగా శాఖలలో పొదుపు సమర్థంగా పరిపాలక శాఖల నిర్వహణ మొదలైన వానిని చర్చించారు.

ఈ చిన్న చిన్న మంత్రులు అధికంగా ప్రసంగించడం మానాలని ప్రధాని సలహా ఇచ్చారని తెలుస్తున్నది. వీరికి ప్రభుత్వ విధానాలు సమగ్రంగా తెలియక పోతున్నందువల్ల, సమస్యలను కలిసి చర్చించుకోడానికి వారి వారి అభిప్రాయాలను తెలుపుకు చేయడానికి అవకాశం అంతగా లభించనందువల్ల, ఈమాదిరిగా సమావేశపరిచే పద్ధతి ఇంక అమలుజరపాలనే సంకల్పం ఉందట.

# ఆంధ్ర పత్రిక
## సారస్వతానుబంధం

1957 సం॥ జూలై 28-వ తేదీ ఆదివారం




పటన్ చెరువు అభివృద్ధి కేంద్రంలోని సమాచార కార్యాలయాన్ని జూలై 28 న రాష్ట్రపతి డా॥ రాజేంద్ర ప్రసాద్‌కు గవర్నరు శ్రీ త్రివేదీ, మంత్రి శ్రీ వి. బి. రాజు, చూపించారు.

## కెంపు తీగ

మేరీ లా విక్

వాళ్లు చూసిన వారందరిలోకీ ఆమె అందమైనది—అందువల్ల ఆమె అంటే వారికి అసహ్యం! ఆవిడను చూసిన కళ్లకు మనం కనపడం కాబోలు అనుకుని ఆడవాళ్లు అసూయపడ్డారు; ఆమె తమకు అందుబాటులో లేదనీ, ఎంత మొనగాడికీ లొంగదే అనీ మొగాళ్లకు అయిష్టం. తోటలో పూలన్నీ గులాబీపాలికతో పుట్టాయా అని ఆడవాళ్లు ఆలోచించుకున్నట్లుంటే ఈ అసూయ ఉండేది కాదు. ఆమెపైన ఎవరు కన్ను వేసినా ఆ అందం విందు చేస్తూనే ఉంటుందనే పరమార్థాన్ని మొగవారూ తెలుసుకోలేదు. అయితే ఆవూరిలో మొగవారు అంత ఉదారులూ కారు, దయాదాక్షిణ్యాలు కలవారూ కారు.

ఇంతకూ ఆమె తనపూర్వీకులఇంటిలో ఉండిపోవడానికి ఒకనాటి సాయంత్రం వచ్చింది. ఆ ఇంట్లో చాలారోజులుగా దీపం వెలగలేదు. ఆమె వస్తోందని ఎవ్వరికీ తెలియదు. పల్లెటి దిక్కున అలాటి తెలియకపోవడాలు చెల్లవు. ఆవిడ ఇంటిపైన పెంకుల్లో ఏవేవో కల్లమూలిన వన్నీ ఇక్కడి నానా గిజాటుగా ఉంటే, వాటిని బాగుచేసుకొని వాన బాధ లేకుండా తలదాచుకుందామనుకుంది.

ఇల్లెక్కింది. జనం చూశారు. ఆమె లాగూ ధరించి ఉంది, మొగాడిలాగా. ఆకాశం పైన అతికించిన ఫోటోలాగా కనపడింది. జుట్టు జరీజిలుగులా ఉంది. ఆవిడ ఎప్పుడూ అందంగానే ఉంటుంది—కానీ ఆ సూర్యకాంతిలో కళ్లు చికిలించుకుని చూసే వారికి ఆమె మరింత అందంగా కనపడి ఉంటుంది. వారి నరనాడుల్లోంచీ మెరుపు తీగలు పాకులాడాయి. ఇక ఆరోజున ఒక్క మొగాడు మనసు ఉంచి పని చేయలేదు—ఒక్క ఆడది స్థిమితంగా ఉండలేదు. ఏమిటో ఉద్రేకం—ఆవేదన—కొండ విరిగి పడ్డట్టు.

మర్నాటికి వాళ్ళు కొంతపాటుకు వచ్చారు. తీరా ఆమె ఆ పాడుపడిన కొంపలో ఉండడానికి వచ్చినది అని నిర్ధారణ చేసుకున్నారు. ఆమె చాలా మితభాషి—అది వట్టి గర్వం అన్నారు. ఇల్లు బాగుచేసుకుంటోంది—వట్టి దుబారా చేసే మనిషి అన్నారు. ఇల్లు బాగు చేసుకున్న తర్వాత, ఊళ్లో వాళ్లందరికీ విందులూ గోవిందులూ చేస్తుందనుకున్నారు కూడాను, అందరూ చక్కగా వెళ్ళవచ్చునని ఉబలాటపడ్డారు! కొత్తసెలా వచ్చేను ఆడ కూతురే అనుకున్నారు!

ఇవన్నీ అనుకుని చివరకు ఆమె మంచి మనిషి కాదని నిర్ధారణ చేసుకున్నారు. పాపం ఆమె చేసిన తప్పు ఏమిటో తెలియదు—ఒక పన్ను అయినా బైటికి పొడుచుకు వచ్చి వున్నట్లుంటే ఆమె అంత పాపిష్టిదిగా కనబడేది కాదు. పొలాల్లో పోతుంటే, ఓరుగాలి కొట్టి ఆమె శోభ మరింత పెరిగేది. వాన కొట్టే, ఆ జల్లు ఆమెజుట్టులో దూరి ఆమెనొక దేవతగా ముస్తాబుచేశాయి.

ఆమె వీధివెంటపోతూ ఇరుగుపొరుగు వారి నెవరినైనా చూసి ఒక చిరునవ్వు నవ్వితే సరి—ఆమె వెక్కిరించిందని చెప్పుకునే వారు—చెవినుంచి చెవికి—ఊళ్లో చెవులన్నిటికీ ఆ వార్త ఎక్కిపోయేది.

పట్నంనుంచి ఆమెస్నేహితులు వచ్చేవారు—అలా వచ్చినవాడు ఆమె ఇంటి కిటికీలన్నిపై అందరి కళ్లూ! వెలుగుచిమ్మే ఆ కిటికీలలోంచి, లోపల కదిలే మనుషులను చూసి, వాళ్ళు ఆమెఅంటే పడి ఛస్తున్నారేమో అనుకునేవారు ఊరివారు. ఆ పట్నంవాళ్ళు కూడా ఊరి మర్యాద తెలిసిన వాళ్లు కారు. ఊళ్ళో ఆమె ఇల్లు తెలియక ఎవరినైనా 'ఫలానా ఆమె ఇల్లెక్కడ' అని అడగడంలో స్వేచ్ఛగా ప్రశ్నలు గుప్పించే వారు. వాళ్లూ అందంగానే ఉన్నారు.

ఆ పట్నంవాళ్లకి ఇంటిపలా చెప్పడానికి, మళ్లీ ఎంత ఆదుర్దా చూపేవా రంటారు ఊళ్లోవాళ్లు! పోస్టుమాస్టరు భార్య అమాంతం కోపిసపడేది, ఫలానావిడ ఇల్లు ఫలానాచోట అని చెప్పడానికి — ఆమెకంటే ముందు అంగడి ఆయన పెళ్లాం ఉరుకులు పరుగుల మీద బయటవాలేది—పాపం! అంగడి ఆయన పెళ్లాం అంతా అందమైనదే, కళ్లల్లో తప్పు! ఊళ్లో అందరూ ఆమెను చూసినప్పుడల్లా "పాపం! ఆకళ్లు అడ్డం వచ్చాయి ఆ అందానికి" అని జాలి ప్రకటిస్తూ ఉంటారు.

ఇక పట్నంవాళ్లు — ఎక్కువమంది మొగాళ్లు. ఊరివాళ్లకు అదొక అందుబాటు అంశం! వాళ్లతో వచ్చేఒక ఆడది సిగరెట్లు తాగుతుంది—మొగాళ్లు సిగరెట్లు వెలిగిస్తారు. ఆమెవస్తువేదైనా కిందపడితే తీసి అందిస్తారు. మరోపిల్ల కూడా వస్తూఉంటుంది. పెద్దింటిపిల్ల అయిఉంటుంది. పెద్దింటి పిల్ల అందమైనదే గానీ, అంగడివాని పెళ్లాం అంత బాగుండదనీ, ఆమెమనుక్కు మరీ బాగుఅయిందనీ, ఊరి మహిళల జాలి!

ఈ ఊరువస్తున్నందుకు పట్నం వాళ్లు సంతోషిస్తున్నారో, వాళ్లను చూసి ఊరివారు ఉబలాటపడ్తున్నారో చెప్పడం కష్టం.

ఒకనాడు ఆమెకూడా, ఆ పట్నం వాళ్లతో గుర్రమెక్కి వస్తోంది. వీధిలో ఒకచోట ఒక గేటుఉంది. ఆమెదిగి ఆగేటును తెరుస్తోంది. గేటు తెరవడంలో ఆమెకు కొంత చేదోడుగా, గుర్రాలెక్కి ఉన్న ఇద్దరు మొగాళ్లు దిగివచ్చారు. కానీ ఆమే ఆ గేటునకట్టి ఉన్న తీగను విప్పుతోంది—అప్పుడు చూశారు ఊరివాళ్లు—ఆమె చేతులు ఎంత అందమైనవి! రోజూ తమతమ ఇళ్లల్లో చూస్తుంటే చేతులు ఎంత పేలవంగా ఉన్నాయి!

అంతే, ఆమె ఉనికి, ఊరివారి బుర్రల్లో ఉక్కపెట్టింది! ఆమె ఆ ట్లాగుర్రంపైన వెళ్ళి తిరిగి వచ్చేటప్పుడు కొంత దన్ని ఉన్నట్లు కనపడితేచాలు, ఊరివారి బుర్రల్లో ఉక్క ఒకింత తగ్గేది! కానీ ఆమె దన్ని ఉండడమూ ఒక అందంగానే ఉంది! మరింత అందంగా కనిపించేది. మానవ చర్మం, పొమికలు, కలసి అలాటి సౌందర్యాన్ని చూపగలగడం యుగానికొకసారి జరుగుతుందనుకొని, ఆమెవంక తెగచూసేవారు—ప్రక్క ఊళ్లవాళ్లుకూడా వచ్చి

ఒక రోజున ఆమెకు ఒక ప్రమాదం సంభవించింది. ఆమె గుర్రం మీద వస్తోంది. దోవలో ఒక గుంట ఉంది. దాన్ని దాటుతుండగా, ఒక చెట్టెక్కిన ముళ్లతీగె ఆమె ముఖం పైన గీచుకుంది. ఆమె కిందపడిపోయింది—వెల్లకిలా. అందరూ నోళ్లు కళ్లు పెట్టుకొని చూస్తున్నారు. ఎవ్వరూ ఉలిక్కిపడలేదు. మెల్లెంగా చుట్టూ చేరి, ఒక చక్కటి చిత్రాన్ని చూస్తున్నట్లు చూశారు. ఆమె ముఖంమీద ఎర్రతీగలను చెక్కినట్లు రక్తం చిమ్మింది. ఆమెను ఇంటికి మోసుకెళ్లారు, చివరకు—జాలిపడి!

రోజంతా, వారి కనురెప్పలక్రింద ఎర్రతీగలే ప్రాకాయి. పోస్టుమాస్టరు పెళ్లాం, కవర్లమీదా కార్డులమీదా ముద్రలు కొట్టూ ఆ ఎర్రముద్రలను చూసుకొని ఉలిక్కిపడింది—ఒళ్లు ఝల్లుమనసాగింది—కళ్ళు కొన్ని బొట్లు రాల్చాయి. అవి ముద్రలతోపాటు కార్డులు కవర్లమీదకూడా పడ్డాయి.

బడిపంతులుగారు ఒక విషాదాంత నాటకను మళ్లీ చదువుకున్నాడు — రక్తం అంటేభయపడేఘటం అయినప్పటికీ. తీరా, మహోత్సవ్యరంగంలోకి వచ్చినప్పుడుమాత్రం, "హా" అనుకుని, "ఆ రజతశరీరంపైన కెంపుజిలుగులాగా రక్తం చిమ్మింది" అనే సంభాషణా భాగంక్రింద గీతలు గీసేశాడు. ఇలాగే ఊళ్లోవాళ్లందరికీ తలకొక అనుభవం. అందరూ, ఒక ఉన్మాది అనుభవంలో భాగస్వాములుగా గడిపారు.

ఆమె మొత్తానికి మూడు వారాలు పడకేసింది. ఒకనాడు స్వాస్థ్యంచిక్కి ఇంటికప్పునుంచి వెలుగు వచ్చేఉపాయం ఉన్న దేమోచూడడానికి ఇల్లుఎక్కింది. అప్పుడు ఊరివారు మళ్లీ చూశారు — నీలిఆకాశంపై అతికించిన ఆ అందాల రాణి ఫోటోను. అనుకున్నారూ— ముఖంమీద అగంట్లు లేకుండా ఉంటే ఇంత అందమైనది మన ఊళ్లోతప్ప మరెక్కడా ఉండదుకదా, అని.

పోస్టుమాస్టరు పెళ్లాం, ఆమెవద్దకు ఒక పత్రవాహిన్ని పంపించింది—"మీరు వియన్నా డాక్టరుకు వ్రాసిన కవరుపైన చీట్లు తక్కువైనాయి" అని. చీట్లు తక్కువైతే, పోస్టుమాస్టరు పెళ్లాంకేం! అలాకాదు—అంత ముఖ్యమైన ఉత్తరాన్ని తాను పదిలంగా చూస్తున్నట్లు చెప్పవద్దూ! ఆమెఅప్పుడుఇంటిమీదే తిరుగుతోంది—పొగగొట్టం ప్రక్కన పిల్లిలాగా, మెరుపులాగా.

నిజమే, గుర్రంమీద దూకుడుగా వస్తోంది—ముఖం గీసుకుపోవడమేగాక విసిరివేసినట్లుకిందపడింది. గీసుకుపోయిన దీపర్మాన్ని కుటకుటలే వచ్చింది. కుట్టిపట్లు, గాయాలు మానినట్లు, స్ఫుటంగా కనపడుతున్నది.

ఆమెను చూస్తే ప్రస్తుతం అందరికీ జాలి. వీధిలో గేటును ఎవరో ఒకరు పరుగునవచ్చి తీసి పెట్టున్నారు. కుర్రాళ్ళ ఆమెకు పూలు బహూకరిస్తున్నారు.

అలా, వాళ్లు ఆమెను రెండువేళ్లపాటు మన్నించారు—ప్రశాంతంగా జీవించింది ఆమె.

ఒకరోజున వియన్నా డాక్టరు ఆమెకు ఒక జాబువ్రాశాడు. రెండేళ్లయింది కాబట్టి, ఇక ఆమె ముఖంమీద కొత్త చర్మాన్ని అంటువేయడం సాధ్యమని అతను తెలియజేశాడు. ఆమె ఆ ఉత్తరాన్ని అందరికీ చూపించింది. ఓ—తప్పక బాగుచేయించుకో తల్లీ అని అందరూ మంచిమాట అన్నారు. ఆమె ప్రయాణమైంది. వాళ్లందరూ సాగనంపారు. వాళ్లందరూ అమాయకులు అని ఆవిడ అనుకుంది. ముఖంమీద గాట్లు లేకపోతే ఆమె అందంగా ఉంటేదని వాళ్లు అనుకున్నారు. "ఆ పరాయి దేశంవాళ్లు ఎలా వైద్యం చేస్తారో జాగ్రత్తగా ఉండు" అని ఆపేక్ష చూపారు.

ఆమె ఒకనాడు తిరిగివచ్చింది. అందరూ గుమిగూడారు. తెగమాట్లాడేసుకుంటూ ఆమెచుట్టూ చేరారు. ఎవ్వరూ ఆమెకు జరిగిన చికిత్స సంగతి అడగలేదు.

మామూలుగానే ఆమె గుర్రంమీద వెళ్తోంది—అదే ముళ్లకంచ, గుంట, ఉన్న దోవనే వెళ్తోంది. మంచి ధైర్యం కల అమ్మాయి అనుకున్నారు అందరూ. ఆమె ముఖం వంకమాత్రం ఎవ్వరూ చూసినట్లులేదు.

రెండుమూడు రోజులు పోయిన తర్వాత, ఆమెకు కొవ్వొత్తులు కావలసి వచ్చాయి. అంగడిలో లేవు. చర్చిలో ఉన్నాయేమో కనుక్కోమని ఒకణ్ణి పంపింది. ఉంటే ఇచ్చేవారేగానీ. ఎందుకివ్వరూ—ఆమెతో సాన్నిహిత్యం కలిగించుకోవడానికి మత గురువులకు అదే మంచి అదను—కానీ చర్చిలోనూ కొవ్వొత్తులు లేవు.

ఇంతలో పోస్టుమాస్టరు పెళ్లాం ఏదో గుర్తు వచ్చినట్లు "ఆ!" అని దీర్ఘం తీసింది. ఏమిటమ్మా అంటే—'కిందటి నెల కొవ్వొత్తులన్నింటినీ వెలిగించేశాం కదూ' అంది. ఎందుకమ్మా అంటే చెప్పలేకపోయింది. అక్కడొక పల్లెటూరి దసరా బుల్లోడు కూడా ఉన్నాడు. వాడికి జ్ఞాపకంవచ్చి "శస్త్ర చికిత్స సరిగా జరగాలని దైవ ప్రార్థనలు చేసి, వొత్తులు వెలిగించేశాం కదూ" అని వల్లడించాడు.

ఎవరికి శస్త్రచికిత్స?

'నా శస్త్రచికిత్స కోసమా?' అని ఆమె అడిగింది, తెల్లబోతూ.

ఆ! ఆమె శస్త్రచికిత్సకోసమే— అంతే అందరూ రణగొణధ్వనితో ఎన్నెన్ని ప్రార్థనలు చేశారో, ఎన్ని వొత్తులు వెలిగించేశారో చెప్పటం ప్రారంభించారు.

వాళ్లు ఎంత మంచి వాళ్ళు!

అయితే, ఆమె శస్త్రచికిత్స చేయించుకుని వచ్చిన తర్వాత మళ్ళీ ఇల్లెక్కలేదు. ఆమె ముఖాన్ని వాళ్లు చూడలేదు! ఇప్పుడు చూశారు!

ఆమె అందం మరింతఅయింది— కనీ వినీ ఎరగనంతగా!

మళ్లీ మొగాళ్ళకి తమ పెళ్లాలు జ్ఞాపకంవచ్చారు!

చాలా వికృతర్వాత—ఆమె అప్పటికి ముత్తవఅయింది. ఆమె ముఖం స్ఫటికంలాగా లేదు—కెంపుజిలుగు జిగిబిగిగా అల్లుకుపోయిందిఅప్పటికి. ముసలాళ్లయిపోయిన మొగాళ్లు ఆమెను చూసినప్పుడు కెంపులతీగలనుకూడా చూస్తున్నట్లు కళ్లు చికిలించేవారు.

ఒకవృద్ధుడు పాడెలోకి ప్రవేశిస్తూ, "ఆమెముఖం గాయాలతోనే ఇంపుగా ఉండేదే—మరి శస్త్రచికిత్స ఎందుకు చేయించుకుందో!" అనుకున్నాడు.

[అనువాదకుడు: జి. కె.]



## సరళ సంస్కృతం

### పాఠము 30

### సుభాషితములు

10 శ్లో॥ వృథా వృష్టి స్సముద్రేషు వృథా తృప్తస్య భోజనం
వృథా దానం సమర్థస్య వృథా దీపో దివాపి చ॥

అన్వ:—సముద్రేషు వృష్టిః వృథా, తృప్తస్య భోజనం వృథా సమర్థస్య (కృతే) దానం వృథా, దివా దీపః అపి వృథా (భవతి)

భావా:—సముద్రములయందు వర్షము, కడుపునిండినవానికి భోజనము, సమర్థునకు దానము పగటియందు దీపము వ్యర్థమైనవి.

11 శ్లో॥ ధనిక శ్శ్రోత్రియో రాజా నదీ వైద్యస్తు పంచమః
పంచ యత్ర న విద్యన్తే న తత్ర దివసంవసేత్॥

అన్వ:—ధనికః, శ్రోత్రియః, రాజా, నదీ, పంచమః వైద్యః తు యత్ర పంచ న విద్యన్తే తత్ర దివసం న వసేత్

భావా:—ధనికుడు, శ్రోత్రియుడు, రాజు, నది వైద్యుడు అను ఐదు సౌకర్యములు లేనిచోట ఒక్కరోజు కూడ నివసింపరాదు.

12 శ్లో॥ లక్ష్మీ ర్వసతి జిహ్వాగ్రే జిహ్వాగ్రే మిత్రబాంధవాః
జిహ్వాగ్రే బంధనం ప్రాప్తం జిహ్వాగ్రే మరణం ధృవమ్॥

అ:—జిహ్వా అగ్రే లక్ష్మీః వసతి, జిహ్వా అగ్రే మిత్రబాంధవాః జిహ్వా అగ్రే బంధనం ప్రాప్తం, జిహ్వా అగ్రే మరణం ధృవమ్.

భా:—నాలుకకొనయందే లక్ష్మి నివసించుచున్నది. స్నేహితులు చుట్టములు దానివలననే ఏర్పడుచున్నారు. దానివలననే బంధనముకూడ సంభవించును. దానివలననే మరణముకూడ తప్పక కలుగును. అనగా కష్టసుఖములకు నోటిమాటయే కారణమని భావము.

13 శ్లో॥ పిపీలికార్జితం ధాన్యం మక్షికాసంచితం మధుః
లుబ్ధేన సంచితం ద్రవ్యం సమూలంహి వినశ్యతి॥

అన్వ:—పిపీలికా+అర్జితం ధాన్యం, మక్షికాసంచితం మధుః లుబ్ధేన సంచితం ద్రవ్యం స మూలం వినశ్యతి హి.

భా:—చీమలు సంపాదించిన ధాన్యము, తేనటీగలు కూడబెట్టిన తేనె, లోభిదాచిన ధనము సర్వము నశించుచున్నవి కదా.

14 శ్లో॥ అర్థాగమో నిత్య మరోగితాచ
ప్రియాచ భార్యా ప్రియవాదినీచ
వశ్యశ్చ పుత్రోర్థకరీచ విద్యా
షడ్జీవలోకస్య సుఖాని రాజన్॥

అ:—రాజన్ అర్థ+ఆగమః, నిత్యం, అరోగితా, చ ప్రియా, ప్రియవాదినీ, భార్యా, చ, వశ్యః, పుత్రః, చ, అర్థకరీ విద్యా, చ, షట్, జీవలోకస్య, సుఖాని.

భా:—ధనము వచ్చుచుండుట, ఎల్లప్పుడు రోగము లేకుండుట, ప్రియురాలై ప్రియముగా మాట్లాడు భార్య కలిగియుండుట, తన వశములో నుండెడి పుత్రుడు, ప్రయోజనకరమైన చదువు అనునవి ఆరున్ను మానవులకు సుఖకరములు. (రాజన్—ఓ రాజా;—ఈ శ్లోకము ఒక రాజు నుద్దేశించి ఒక కవి చెప్పినది.)

### లోకోక్తులు

10 నాస్త్యగ్నే ర్దౌర్బల్యమ్.

అ:—అగ్నేః దౌర్బల్యంన అస్తి—అగ్నికి దుర్బలత్వము లేదు.

11 నాస్తి రత్న మఖండితమ్

అ:—అఖండితం రత్నంన అస్తి—సానబట్టి ముక్కలుతీయని రత్నముండదు. గొప్పదైన రత్నమునకుకూడా సానబట్టనిదే ప్రకాశము రాదని భావము.

12 నికృతి ప్రియాః హి నీచాః

అ:—నీచాః నికృతి ప్రియాః హి—నీచులు నీచపు పనులయందే ఇష్టము గలిగియుందురు.

13 న చేతనవతాం వృత్తిభయమ్

అ:—చేతనవతాం వృత్తిభయం న—ఉత్సాహశీలురకు వృత్తిని సంపాదించుకొనలేమను భయము లేదు.

14 న శించతి పుష్పార్థీ శుష్కతరుమ్

అ:—పుష్పార్థీ శుష్కతరుం న శించతి — పువ్వులను కోరువాడు ఎండిన చెట్టుకు నీరు పోయడు

15 న వంశవృక్షేషు ఫలన్తి ద్రాక్షాః

అ:—ద్రాక్షాః వంశవృక్షేషున ఫలన్తి — ద్రాక్షపండ్లు వెదురుపొదలయందు లభింపవు.

సూచన:—ఇంతవరకు శ్లోకములకు-లోకోక్తులకు భావార్థములు మాత్రమే వ్రాయబడినవి. ఆయా శబ్దముల లక్షణము తెలిసిన వేగాని వీని ప్రతిపదార్థమును సంస్కృతభాషా మర్యాద ననుసరించి తెలిసికొనుటకు సాధ్యపడదు. తరువాత అనుభవముపై ప్రతిపదార్థము తెలిసికొనగలరు.

# పాతాళంలో 133 రోజులు
## మా యాత్రా చక్రంలో ఒక ఆకు విరిగింది

కైనాన్ అఖాతంలోకి వెళ్ళడానికి ఎంతో శ్రమపడ్డాము. ఆ శ్రమ ప్రారంభంలోనే మా 'ధీర' చక్రపు ఆకు విరిగింది. తీరా కైనాన్ అఖాతంలోకి వెళ్ళాము. కైనాన్ తీరంలో పరిశోధనలూ పరిశీలనలూ చేశాం. ఏమీ శ్రమపడలేదు. కానీ మాబృందంలో యువకుడూ ధీరుడూ అయిన 'మూర్' పాలపుందులో చిక్కుకొని మరణించాడు. మా యాత్రా చక్రంలోని ఒకఆకు విరిగిపోయింది! కైనాన్ అఖాతంలోంచి ఎంతో బాధతో బయటపడ్డాము.

### గ్లెన్ జాకొబ్‌సెన్

జనవరి 20 నాడు, అట్కా, కైనాన్ అఖాతం ప్రాంగణంలో కొచుకు నిల్చింది. లంగరువేయడానికి తగు అవకాశంకోసం చూస్తున్నాం.

ఇవాళ కొంత స్థిమితం చిక్కింది. మంచుకొండల్లో దబ్బలాడి వచ్చి, చక్రం ఆకు విరిగింది కాబట్టి, ఓడ ఎలా నడుస్తుందో మరొకసారి పరీక్షించడానికి అటూ ఇటూ పరుగెత్తించి చూశాం. కొంత పట్టుపట్టుగానే నడుస్తోంది. ఫరవాలేదు. ఇక లాభం లేదను పని అమెరికాకు పలాయనం చిత్తగించవలసిన పరిస్థితి రాలేదు. మాపని మేము సాగించవచ్చు. ఇంతలో ఒక ఆగ్నేయ పవనం వీచింది. మంచుగడ్డలు కొన్ని చెదిరి కొట్టుకుపోయాయి. ఇలాటి గాలి ఇంకా వీచితే మంచిది. అఖాతంలో నిరభ్యంతరంగా ప్రవేశించవచ్చు.

జనవరి 24: పాలపుందు మూలంగా లెఫ్టినెంట్ జానీమూర్ చనిపోయాడు. మా యాత్రలో ఇంతవరకూ, ఎవ్వరికీ చిన్న దెబ్బ కూడా తగలలేదు. మూర్ చాలా సరదామనిషి. మంచి విమాన చోదకుడు. ఓడపైన ఆటలుపాటలు నిర్వహిస్తున్నాడు. అనేక కాలక్షేపాలు కల్పించగలమనిషి. 26 ఏళ్ళు. పెళ్ళికాలేదు. అందరికీ తలలో నాలుకలాగా ఉంటేవాడు. ఇక కొద్దిరోజుల్లో నౌకాదళంనుంచి పని మానుకొని తన ఊరికిపోయి ఏదో వ్యాపారం చేసుకుందామనుకుంటున్నాడు.

జనవరి 21 నాడు ఆగ్నేయ పవనాల మూలంగా మంచుగడ్డల అడ్డంకులు తొలగిపోయాయి. కైనాన్ అఖాతం హిమక్షేత్రం వద్ద గట్టి తేవులభిస్తుందనే ఆశతో సాగాము. హిమక్షేత్రం వద్దకు చేరాము. మామూలుగా లంగరు వేసుకోలేదు. తీరా ఆ హిమక్షేత్రం గట్టిదవునో కాదో! అందువల్ల, ఒక పెద్ద దుంగను మంచుగడ్డలోకి దింపి దానికి ఓడను కట్టివేశాం. అమాంతం కదిలిపోవలసివస్తే, లంగర్లను వదిలిపెట్టిపోయే దుస్థితి కలగకుండా, దుంగను వదిలి పోవచ్చు కదా అని. ఇదంతా చేస్తుంటే ఒక అరడజను పెంగ్విను పటాలం లాగా చూస్తూ నిలబడ్డాయి; ప్రేక్షక మహాజనం.

కొందరు ఒడ్డుకుదిగారు. 'స్కీ'ల సహాయంతో వెళ్లి, ఆ మంచునేల గట్టిగా ఉందో లేదో, విమానాలు దిగడానికి తగు బలం ఉందో లేదో చూశారు. దోవ తప్పకుండా ఉండడం కోసం, తాము వెళ్ళిన దోవల్లో అక్కడక్కడా జండాలు పాతారు.

### సర్వభక్షకులు

ఒక తమాషా—'స్కువా గల్స్' అనే పక్షులున్నాయి, ఈప్రాంతంలో. అవి ఒక రకమైన సర్వభక్షకులు. ఇవి 'స్లెడ్జి' బల్లులలాగే కుక్కలను కూడా ఎదుర్కొనేటంత సాహసం కలవి. అవి, మా జండాలను పీకి ముక్కలు చేశాయి, అవేవో తినేపదార్థాలనుకొని. అక్కడితో వదలలేదు. మా పరిశోధకులు వాడే యంత్రాల తీగలను కొరికివేశాయి! తినేశాయి.

తర్వాతతర్వాత పరిశోధక యాత్రలలో ఈ తీగలపైన వేసే కవచం స్కువాగల్ తినడానికి పనికి రానిదిగా తయారు చేయించాడు, పూజ్య శ్రీ సీన్‌హన్.

కైనాన్ అఖాతం మజిలీకి అనుకూలంగానే ఉంది. రాబోయే పరిశోధక బృందం ఇక్కడ మకాంవేసి పని చేసుకోవచ్చు. అక్కడా అక్కడా పెద్ద పెద్ద చెరియలూ గోతులూ ఉన్నాయి—వాటిని బుల్‌డోజర్లు పూడ్చేస్తాయి. చక్కగా ఎన్నెల బయలులాగా ఉంది. ["ఎన్నెలబయళ్లలో-వేలసంఖ్యలలో-ఆసనము పెట్టించి—" అని 'ధర్మరాజు జూదం'లో ఉంది. ఎన్నెలబయలు అంటే పేట స్టేడియంలాంటిది. కానీ ఆ పాటను అచ్చుకొట్టినవారు, దానిని 'వెన్నెల బయళ్లలో' అని దిద్దారు. జి. కె.] విమానాలు దిగడానికి చక్కటి బయలు ఉంది.

### దూదితెర

జనవరి 22 చాలా దుర్దినం. పరిశీలకులనూ, ఛాయాచిత్రగ్రాహకులనూ, హెలికోప్టర్లలో తగు స్థానాలకు చేరవేస్తున్నాము. ఒక ఉన్నత ప్రదేశంలో కొన్ని ప్రేలుళ్లు సాగించి, క్రింది భాగాల్లో ఎలాటి కంపాలు సంభవించాయో గమనించాలని పూజ్య శ్రీ శీకహాక్ పూనుకున్నారు. అలా చేస్తే ఆ మంచుగడ్డ ఎంతలోతు దాకా వ్యాపించి ఉందో, దాని కింద ఏమి ఉన్నదో, ఆ ఉన్న దానికి ఎలాటి కంపాలు తటస్థించాయో తెలుస్తుంది.

లెఫ్టినెంట్ మూర్, పూజ్య శ్రీ శీకహాన్ బృందాన్ని పరంజామను హెలికోప్టర్‌లో చేరవేస్తున్నాడు. ఓడమీద నుంచి బయలుదేరేటప్పుడు వాతావరణం స్వచ్ఛంగానే ఉంది. హెలికోప్టర్ ఎగిరిన తర్వాత పాలపుంధు కమ్ముకుంది. దూదితెరవేసి నట్లయింది. భూమి (మంచుగడ్డ) ఎక్కడో ఆకాశం ఎక్కడో కనపడదు. గాలిలోనే ఎగురుతున్నామేమో తెలియదు. మూర్ కొన్నిసార్లు పైనే తిరిగాడు.

పూజ్య శ్రీ శీకహాక్ అప్పటిస్థితిని ఇలా వర్ణించాడు: మూర్ తన హెలికాప్టర్‌ను 30 డిగ్రీల కోణంలో దింపుతున్నాడు. విమానం క్రింద పడిపోతుందేమో నన్న భయం కలిగి, నేనూ, లెఫ్టినెంట్ లోరో, హెలికోప్టర్ కిందకు పరుగెత్తుకొస్తూ 'దిగవద్దు, దిగవద్దు' అని కేకలు వేశాము. మూర్‌కు మా కేకలు వినపడలేదు. హెలికోప్టర్ కూలిపడింది, రెండు ఫర్లాంగుల దూరంలో. అతని కోసం దేవుని ప్రార్థిస్తూ పరిగెత్తాను. "లారో! స్కీలు తగల్చుకో! పరుగెత్తు" అని అరిచాను. లోరో ధరించాడే కానీ, నేను ధరించడం మరిచిపోయాను."

### మెట్రోలిస్ చాకచక్యం

ఇది ఇలా ఉండగా పూజ్య శ్రీ శీకహాక్ ప్రయోగాలకు సహాయకుడుగా పనిచేస్తున్న జోసఫ్‌టావరెన్‌ను వేసుకొని ఆల్బర్ట్ మెట్రోలిస్ మరొక హెలికోప్టర్‌లో బయలుదేరాడు. ఆ హెలికోప్టరూ పాలపుందులో చిక్కుకుంది. అయితే మెట్రోలిస్‌కు కొంత దృష్టి ఆనింది—లీలగా. ఏదేదో కనపడి, మూర్ వెళ్ళిన హెలికోప్టర్ పడిపోయిందని గ్రహించుకుని 'అట్కా'కు రేడియోలో చెప్పాడు. పూజ్య శ్రీ శీకహాన్, లెఫ్టినెంట్ లోరో, పడిపోయిన హెలికోప్టర్ దగ్గరకు వచ్చేసరికి మెట్రోలిస్ కూడా చేరుకున్నాడు. హెలికోప్టర్‌ను కొంత ఎత్తులోనే నిలబెట్టి టావరెన్‌ను 'కొంత పట్టుకుని ఉండండి' అని అప్పగించి, తానుదూకి మూర్ దరికి చేరాడు. వెంటనే మూర్‌ను పైకి లేవదీశాడు. మూర్‌కు స్మారకం బాగాలేదు. పైన ఎక్కడా గాయాలూ కనపడలేదు. ఎక్కడో కానిరాని దెబ్బలు తగిలి ఉంటాయి. "నేను ఎక్కడున్నాను?" అని మూర్ అడిగాడు. మెట్రోలిస్ అతనికి జరిగినదంతా చెప్పాడు. హెలికోప్టర్‌లోంచి ఒక 'స్లెడ్జి' బండినిలాగి, దానిపైన మూర్‌ను పడుకోబెట్టి, మళ్ళీ హెలికోప్టర్‌లోకి చేర్చి, మెట్రోలిస్ దాన్ని 'అట్కా'పైపుకు ఎగరవేసుకు వచ్చాడు. కానీ 'పాలపుందు' వదలలేదు. మెట్రోలిస్ నడుపుతున్న హెలికోప్టర్ కూడా కింద మంచుగడ్డకు కొట్టుకొని, మెట్రోలిస్ చాకచక్యంవల్ల, మళ్లీ పైకి ఎగిరివస్తోంది. పూజ్య శ్రీ శీకహాక్ ప్రమాదం జరిగినచోట నిలబడి ప్రార్థనచేస్తూనే ఉన్నాడు. పదినిముషాల్లో మూర్‌ను అట్కాపైకి తెచ్చారు.

మూర్‌కు చాలా నిపుణుడైన వైద్యుడే చికిత్సచేశాడు. మూర్‌కు ఒంటిలోపల దెబ్బలు తగిలిఉంటాయి. ఏ చికిత్స చేసినా ప్రయోజనం లేకపోయింది. మూడుగంటల తర్వాత మూర్ కన్నుమూశాడు. అతనిదేహాన్ని అమెరికాకు తీసుకునివెళ్లి వాళ్ల అమ్మానాన్నకు అప్పగించాలని నిర్ణయించుకున్నాము. మరేపనీ చేయలేక, నిర్విణ్ణులమై, మా సంభాషణల్లో, పనుల్లో, కాలక్షేపాలలో తటస్థించిన లోటును మననం చేసుకుంటూ, కూలబడిపోయాము.

### జాగరణ

ఇక ఈలోగా—పూజ్య శ్రీ శీకహాక్, లెఫ్టినెంట్ లోరో, విలియమ్స్, టావరెన్, అట్కిన్‌సన్, ప్రమాదం జరిగినచోటనే ఉండిపోయారు. వాళ్లని తీసుకొనిరావడం అసాధ్యమయింది. పాలపుందు వదలలేదు. మర్నాడు ఉదయం అక్కడికి వెళ్లాం. వాళ్ళు రాత్రంతసేపు అక్కడ ఉండిపోవడానికి కావలసిన దుస్తులతో వెళ్లలేదు. అదృష్టవశాత్తు వాతావరణం కొంత బాగుంది. లేకపోతే ఏమయ్యేవారో!

హెలికోప్టర్‌లో వాళ్లకి ఒక గుడారం, ఒక పార, కొన్ని తినుబండారాలూ కనపడ్డాయి. గుడారం వెయ్యాలంటే వారికి కట్టుకొయ్యలు నిలవలేదు. నానా తంటాలుపడి గుడారాన్ని వేసుకున్నారు. ఆ రాత్రి గాడ్పులు రాలేదు, దేవుడు మేలు చేసి. చలి ఎక్కువై వణుకు పుట్టినప్పుడల్లా పారతో చెక్కడం ప్రారంభించారు, వళ్ళు కొంత వేడెక్కడానికి. పడుకునేందుకు పడకలేదు. ఒక స్లెడ్జి ఉంది. దానిపైన వంతులవారీగా ఇద్దరిద్దరు చొప్పున నిద్రపోయారు. మధ్యమధ్య 'స్కీ'ల సహాయంతో అటూ ఇటూ తిరిగి వంటికివేడి కలిగించుకున్నారు. ఎవ్వడూ చలికి బాధపడలేదు—నిద్రా సౌకర్యంలేదనీ బాధపడలేదు. మూర్ విషయమే, ఆలోచన.

తీరా వీళ్ళను వెనుకకు తీసుకురావాలని వెళ్ళేసరికి మళ్ళీ 'పాలపుందు' ముసించుకొచ్చింది. తంటాలుపడి వాళ్ళను తెచ్చాం కానీ మిగతా వస్తువులను తీసుకొని రాలేక పోయాం. ఆ మర్నాడు వెళ్ళి, ఒక వరసలో అన్నింటినీ చేరవేసుకొచ్చాం, ఒక్క గుడారాన్ని తప్ప. ఆ ఒక్క దానికోసం, మళ్ళీ వెళ్ళడం ఎందుకులే అని మానేశాం. ఆహిమక్షేత్ర శృంగానికి మూర్ పేరు పెట్టే మంచిదని నిర్ణయించుకున్నాం.

అట్కా, కైనాన్ అఖాతం వదిలి వచ్చేస్తోంది. ఒక్క తడవ వెనక్కు తిరిగి చూశాను. మూర్!—మూర్!— మూర్!— [సశేషం]

—జి. కె.

కథానిక

# పోటు: పాటు

'శివరాం'

(గతవారం తరువాయి)

రంగయ్యదగ్గర ఇప్పుడు రొఖ్ఖం లేక పోయినా-అతడి ప్రేయసి సరళమ్మ దగ్గర పాతిక వేలవరకూ డబ్బు తిరుగుతూంది. బి. ఎస్. క్రాస్‌వర్డ్సు బాపతు-సొమ్ము రంగయ్య పూర్తిగా ఖర్చుచేసే వాడు! సరళమ్మ దగ్గరవున్న రొఖ్ఖమంతా-మిల్లు లాభాలమీదనే!

సరళమ్మ దీపం వుండగానే యిల్లు చక్కబెట్టుకోవాలనే తత్వంగల వ్యాపారస్త్రీ; అందువల్ల—యేలాగో డబ్బు జాగర్త చేస్తూంది.

రంగయ్య వ్యాపారంలో డబ్బు అవసరమైనప్పుడల్లా-తన ప్రేయసి, సరళమ్మను ప్రాధేయపూర్వకంగా అడుగుతాడు. అతడిసొమ్ము అతడికే యిస్తున్న సరళమ్మ: "నా దగ్గర యెక్కడ కూర్చుంది"-అని గునుస్తూ యే కొద్దిమొత్తమో అతడిచేతి వుంచుతూంటుంది! సరళమ్మ వ్యామోహంలో పడిన రంగయ్య-జమా ఖర్చుల ఆరా పెద్దగా తీయడు. "ఏదో యిచ్చింది...ఏదో పుచ్చుకొన్నా"-అంతే అనుకుంటూంటాడు. తక్కినది ఆమె రహస్యంగా దాచుకుంటూంటుంది.

సరళమ్మ అనురాగం ఒకమూల పొంద ప్రయత్నిస్తున్న రంగయ్య, రంగజమ్మమీద నీతికన్ను వేశాడు! సంపాదన ఆరంభమైన రోజుల్లో అతడామె ఎడల చూపించిన అనురాగం క్రమంగా అదృశ్యమైంది. ఆ అనురాగం ఆగ్రహమై కూర్చుంది. రంగజమ్మను రంగయ్య తిన్నగా చూడటంలేదు. అతడు తిన్నగా యింటికే రానప్పుడు చూడటం యేలాగు జరుగుతుంది? ఎటువచ్చి యింట్లోకి కలసిన వెచ్చాలు... అవసరమైనవి యెవరో ఒకళ్ళు తెచ్చి యిస్తూండటంవల్ల - దుఃఖభారంతో రంగ మానసిక దౌర్బల్యంతో జమ్మ కాలక్షేపం చేస్తూంది. ఇంటికి ఏదో పనిమీద వచ్చినప్పుడైనా రంగయ్య ఆమెతో తిన్నగా మాట్లాడడు. రుసరుసలాడుతూ వచ్చే అతగాడ్ని-తనకంటికంటె మంచి అవకాశం లభ్యం కాదన్నట్లుగా రంగజమ్మ ఏడుస్తూ: "నే నేం తప్పిదం చేశాను?"-అంటూ యేమి టేమిటో అడుగుతుంది.

రంగయ్య, రంగజమ్మను నాలుగుతిట్టి: "నా యిష్టమొచ్చినట్లుగా నే యేడుస్తాను. నీ కెందుకే...ఇష్టం లేకుంటే-యే నూతిలోనయినా పడి చావు"-అంటూ నిష్క్రమిస్తాడు.

రంగజమ్మ భోరున ఏడుస్తుంది. ఈ విధంగానే కాలం దొర్లుతూంది!

* * *

ఆశకు ఒక హద్దు వుండదు. సంపాదన ప్రారంభించినవాడు ఇంకా సంపాదించా లనుకుంటాడు. ఆ సంపాదన కోసం-మంచి చెడ్డ లాలోచించకుండా తీవ్రప్రయత్నాలు చేస్తాడు. అవి చాలాముట్టుకు దొడ్డిదారిలే అయివుంటాయి! అందు మూలకంగా అతడు మింటికెగయటమో, లేక అధఃపాతాళలోకానికి దిగజారటమో జరుగుతుంది.

రంగయ్య మిల్లు పనిచేస్తూంది; దాని ద్వారా అతడేదో మొత్తం సంపాదించుతున్నాడు. ఆ మొత్తాన్ని-తన స్వంతంగా భావించకుండా-కొనుక్కు తెచ్చుకొన్న అందాల ప్రేయసి సరళమ్మచేతుల్లో వుంచుతాడు. దీపం వుండగానే యిల్లు చక్కబెట్టుకోవాలనే తత్వం కలిగివున్న సరళమ్మ: "నీకంటె మరి నా కెవ్వరు?"-అని, ప్రేమవలక బోస్తూ, ఆ నోట్లను తీసుకొని వాటిలో కొంత రహస్యంగా తన పేర బ్యాంకులో జమచేయించుకుంటూంటుంది. సంపాదన రంగయ్యదే అయినా-దానికి వారసురాలు సరళమ్మ అవుతూంది! ప్రేయసిని రంగయ్య డబ్బుగూర్చి సాధారణంగా అడగడు. ఒకవేళ అడిగినా: "నాదగ్గిర యెక్కడ కూర్చుంది? ఈ కొద్ది మొత్తం మాత్రం వుంది"-అంటూ సరళమ్మ పదో, పరకో అతడిచేత వుంచుతూంటుంది!

రంగయ్య నిర్ఘాంతపోతాడు! కానీ సరళమ్మ వాలుచూపులు మీదపడటంతోనే-అతడు తేరుకుంటాడు!

ఏమయితేనేం-రంగయ్య డబ్బు సంపాదించుతున్నాడు! అతడి ఆశలు అధికమయ్యాయి! ఒకప్పుడు-కానీ డబ్బయినా లేనటువంటి రంగయ్య చేతడబ్బు లేనటువంటి లక్షాధికారి అయ్యాడు! అంతేకాదు-అతడిలో యింతవరకూ వున్న దుర్వ్యసనాలతో పాటు దురుద్దేశాలు కూడా అధికమయ్యాయి!

* * *

ఒక దినం ఉదయం-రంగయ్య ప్రేయసి-సరళమ్మ యింటికి హడావుడిగా వచ్చాడు. అలవాటు ప్రకారం, సరళమ్మ రంగయ్య జేబులు తడుముతూంటే, అతడు నవ్వుతూ. "నా దగ్గర లెఖ్ఖ ఎక్కడుంది? దానికోసం నీ దగ్గరికే వచ్చాను"-అన్నాడు. నిజాని కతడిదగ్గర లాభం బాపతు కొంత లెఖ్ఖ వుంది. అది అక్కడే కతడు తీసుకు రాలేదు.

సరళమ్మ నిర్ఘాంతపోతూ: "అదేమిటి? ఎందుకూ"-అని ప్రశ్నించింది.

"కొత్త వ్యాపారం ప్రారంభించుతున్నా. ఈ దినమే స్నేహితులు లభ్యమయ్యారు...ఇక అంతా బంగారమే" అంటూ రంగయ్య సరళమ్మ చెవిలో యేమిటో చెప్పాడు.

"అయ్య బాబో! దొంగనోట్లే"-సరళమ్మ అరచింది:

"దొంగనోట్లే! అయితే మాత్రం భయం ఏమిటి?-తెలివితేటలుగా వాటిని మార్చుమ్ము; ఆ డబ్బు పడేసి-వీలయిన విధంగా వస్తువులు కొంటేస్తూ వుండటమే; కూలీల మస్తర్లలో డబ్బులోనూ వుంచటమే! అసగనివాడిదే లోటు! చేబదుళ్ళకు - సొమ్ము ఇచ్చేయటమే! చూడు యిక మన తడాఖా. ఒకరూపాయి అయిదు రూపాయలవుతుంది. ఇరవై వేల పెట్టుబడి లక్షరూపాయ లవుతుంది. ఇప్పుడిటువంటి నోట్లు ఎంతమంది మార్చటం లేదు? నువ్వు అమాయకురాలవు గనక భయపడుతున్నావ్. అంతా నీ అనుమానం. అదృష్టవంతుడ్ని భగవంతుడు కూడా చెరపలేడు. నాకు నేను అదృష్టవంతుడ్ని. దానివల్లనే అంతవాడినింత అయ్యాను. ఇంకా అవుతాను. వాళ్లు తయారుచేసే సరుకులో మనకేం సంబంధం లేదు. మనం లెఖ్ఖ యిచ్చి ఆ సరుకు పుచ్చుకొని నెమ్మదిగా మార్చుకోవటమే" - అని గొప్పగా రంగయ్య, సరళమ్మతో యేమిటో చెప్తున్నాంటే,

ఇష్టంలేని సరళమ్మ: "మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి. నాకేం తెలియదు. మీకు కావలసిందాన్ని కాబట్టి అటువంటి పిచ్చిపనులజోలికి పోవద్దంటున్నానంతే!"-అంటూంటే,

"అదంతా...సరేలే...మరి నే అడిగేది...లెఖ్ఖ"-రంగయ్య నవ్వాడు.

"లెఖ్ఖ నా దగ్గర ఎక్కడుంది?"-సరళమ్మ అబద్ధమాడింది! నిజాని కిప్పుడామెదగ్గర, పన్నెండువేల క్యాషూ, బ్యాంకులో మరో అంత రొఖ్ఖం వున్నాయి! బ్యాంకులోవున్న రొఖ్ఖం సంగతి రంగయ్యకు తెలియదు. అతడు ఏదో మొత్తం అంతా ఆమెదగ్గరే ఉన్నదనుకుంటున్నాడు.

సరళమ్మ ఆవిధంగా అనటంతోటే, రంగయ్య ఆశ్చర్యపోయాడు. ఇంతకాలం-తన జేబులు తడిమి, ఉన్నదంతా కాజేసిన ప్రేయసి - సరళమ్మ దగ్గిర లెఖ్ఖ ఏంలేదూ? తన జేబుల్లోంచి - తీసి, జాగ్రత్త చేసుకొన్న రొఖ్ఖమంతా యేమయింది?

రంగయ్య ఆమెవంక అదోవిధంగా చూసి: "ఇంతకాలం - జేబుల్లోంచి - లెఖ్ఖ తీసి, దాచుకొన్న నీ దగ్గర ప్రస్తుతం యేం లేదన్నమాట! సరళమ్మా నువ్వు నిజంగా అమాయకురాలవ్! ఈ వ్యాపారం అంతా నే చేస్తున్నది ఎవరికోసమూ అంట? నా సరళమ్మను ఒక పళంగా లక్షాధికారిణిని చేసిపారెద్దామనికాదూ? నీవు మాత్రం పెద్దగా ఆలోచనలుండవ్..." అన్నాడు!

ఈ మాటలతో సరళమ్మ లొంగిపోతూ: "అన్నీ మాటల్లోమాత్రం; అడిగినప్పుడల్లా మీరు లెఖ్ఖ యిస్తూంటే నా దగ్గర ఎక్కడ ఉంటుంది? ఏదో వ్యాపారానికంటున్నారు కనుక నేను దాచుకొన్నదాన్నే మీ కిస్తాను. నా దగ్గర మొత్తం పదివేలున్నాయ్."

"మొత్తం వున్నది పదివేలే"—రంగయ్య అమాయకంగా, ఆశ్చర్యపోతూ అన్నాడు!

"కాక-" సరళమ్మ అతడివైపు తీవ్రంగాచూసి అంది: "అందులో రెండువేలు నా స్వంతఖర్చుల కుంచుకుని, మిగిలినది ఇమ్మంటే యిస్తా"-

"సరే అదే ఇయ్యి" అన్నాడు రంగయ్య ఎలాగో.

సరళమ్మ, ఇనుపపెట్టె తెరచి ఎనిమిదివేలు తెచ్చి ఇచ్చింది! రంగయ్య ఆ మొత్తం తీసుకుంటూ, గుటకలు వేస్తూ, అక్కడనుంచి నిష్క్రమించాడు. ఏదో లాభంబాపతు రొఖ్ఖం ఇప్పుడు రంగయ్యదగ్గర ఏడువేలుంది. సరళమ్మ ఇచ్చిన దానితో అది పదిహేను వేల మొత్తంఅయింది. రంగయ్య లక్షరూపాయల కొత్తనోట్లను పుచ్చుకుందామనుకుంటున్నాడు; మరో పదివేలరూపాయలను రంగయ్య ఎక్కడో చేబదులుగా ప్రయత్నించి తెచ్చాడు; పదివేలలో, అయిదువేలు తన అవసరాలకు ఉంటాయని అతడి ఉద్దేశం.

* * *

ఆ సాయంకాలం రంగయ్య కొత్తగా సంపాదించుకొన్న మిత్రులను ఒక రహస్యప్రదేశంలో కలుసుకొని, వాళ్లచేతుల్లో ఇరవైవేలూ పోసి తనకు కొత్తనోట్లను ఇవ్వమన్నాడు.

రంగయ్య కొత్తగా సంపాదించుకొన్న స్నేహితులు: "ఈ వ్యాపారం చేసేవాళ్ళకు ధైర్యం ఎక్కువగా ఉండాలి. ఇది మొదటి మారవటంవల్ల మీకు కొంచెం ఖంగారుగా వుండవచ్చు. అలవాటయితే యీ నోట్లను పాతవాటిగా మార్చటం వేలిగోరుతీసి అవతల పారవేసినట్లే! మీకిదంతా కొత్త కాబట్టి సలహాలనిస్తున్నాం. మేమిచ్చే కొత్తనోట్లను మీరు సమయాన్ని కనిపెట్టి చలామణీ చేయాలి! వీలున్నదికదా అని అన్నిటినీ ఒకే సారి తోసివేయ ప్రయత్నించకూడదు. అది ఒక క్రమంలో జరగాలి. ఏ మాత్రం ఆచోకీ ఎవరికీ యివ్వకుండా చిక్కకుండా యీ వ్యాపారం చేయాలి! ఇటువంటి వ్యాపారాల్లో వాటాదారుడైన ప్రతీవ్యక్తీ-ఎదటవాడి మీద నమ్మకం వుంచుకొని, ప్రాణానికి ప్రాణం యివ్వటానికి సిద్ధపడాలి"- అని సలహా యిచ్చి, రంగయ్యను వాళ్లు తమ రహస్యమందిరంలోకి తీసుకుపోయారు!

రంగయ్య తయారవుతున్న నోట్లను చూచి-ఎంతగానో ఆశ్చర్యపోయాడు! ఈలాంటి కామధేనువు వున్నప్పుడు తాను కోటీశ్వరుడవటానికి ఆట్టే వ్యవధి అవసరం వుండదనుకొన్నాడతను.

అతడు-ఒక కొత్తనోటు తీసి, జాగ్రత్తగా పరీక్షచేశాడు! పట్టిగా పరిశీలన చేస్తేగానీ - సాధారణనోటుకూ దానికీ భేదం కన్పట్టటంలేదు...

రంగయ్య ఏమిటో యోచిస్తూంటే-వాళ్ళల్లో ఒకడు నోట్లవంక చూసి, "తేమగా వున్న నోట్లను తీసుకెళ్ళి ఆయనేం చేయగలడు?-రేపు ప్రొద్దుట పూర్తిగా ఎండినాక ...మనలో యెవరో ఒకళ్లం-మిల్లు దగ్గరకు తీసుకెళ్ళి ఆయన కివ్వవచ్చు"-అన్నాడు.

"నోట్లు తేమగా వున్నాయి..చేయి వలసింవకే"- అన్నారు మిగిలిన వాళ్లు!

రంగయ్య తెల్లబోయాడు! వెంటనే వాళ్ళు-నోట్లను యిస్తారనే వుద్దేశంతో-యిరవై వేలను వాళ్ల చేతుల్లో పోసాడు: కానీ అవి తేమగా వున్నాయ్! అవి ఎండితేగాని వుపయోగపడవ్ - అందుకని - తన లెఖ్ఖ వాళ్లదగ్గర వుంచి-వెళ్ళిపోవటమా? విళ్ళు మోసం చేయరు కదా?

రంగయ్య అనుమానించుతున్నట్లుగా వాళ్ళల్లో ఒకతను గుర్తించాడు: "రంగయ్యగారూ! మీ డబ్బుకేం భయం లేదండీ! చేతికివచ్చింది మేం వదలం! ఈ వ్యాపారంలో ఒకళ్ళమీద వేరొకళ్లం పూర్తిగా నమ్మకం వుంచుకోవాలని, ముందుగానే మనవి చేశాంగా! రేపు - ఏదో వేళ ... మీ మిల్లుదగ్గరకు-మాలో యెవరో ఒకళ్లం వచ్చి-రహస్యంగా లెఖ్ఖ అందచేస్తాం సరా"

రంగయ్య: "సరే"—అని చెప్పుకోవటం తప్పనిసరి అయింది! అతడు లేచి బయలుదేరుతూంటే: "అంతా రహస్యం సుమా"- అన్నారు వాళ్ళు.

"అలాగే"- అంటూ రంగయ్య బయటకు వచ్చేశాడు!

* * *

మర్నాడు...

రంగయ్య మిల్లుదగ్గర ఆ వుదయం నుంచీ వాళ్ళకోసం యెదురుచూస్తున్నాడు. పెద్ద గుమాస్తా శేషయ్యపంతులు అతడితో వచ్చి-యేమిటో చెబుతాడు; కానీ రంగయ్యబుఱ్ఱలోకి ఆ విషయాలు ఎక్కటంలేదు. ఏలాగో: "సరేలెండి. ఆ తరువాత ఆ విషయాలు తేల్చుకోవచ్చు. ముందు నాకోసం యెవరైనా వస్తున్నారేమో గేటు బయటకు వెళ్ళి ఓమారు చూసి రండి"- అంటాడు.

శేషయ్యపంతులు గేటుదాకా వెళ్లి వచ్చి, ఎవరూ లేరంటాడు, రంగయ్య ముఖం చిన్నబుచ్చుకుంటాడు.

ఈ విధంగా ఆ మధ్యాహ్నం మూడుగంటల వరకూ, రంగయ్య ఆదుర్దాతో కాలక్షేపంచేశాడు! కానీ వాళ్ళు రాలేదు. రంగయ్య ఆదుర్దా అధికమయింది.

చివరకు మూడున్నర గంటలవేళ మనస్సును వుంచబట్టలేక-తనకుతానే-మిత్రుల్ని కలుసుకోటానికి బయలుదేరాడు రంగయ్య!

రంగయ్య ఒంటరిగా నడకసాగించి పెద్దవంతెన దగ్గరకువచ్చాడు; అతను-నూతనంగాసంపాదించుకొన్న మిత్రులను కలుసుకోవటానికి, ఆ వంతెనకు ఎడంవైపుగానున్న రోడ్డుమీద మైలున్నర దూరం ప్రయాణంచేయాలి.

రంగయ్య అలా ముందుకు సాగిపోదామనే నడకసాగించాడు. కానీ.. ఆ రోడ్డుమీద ఫర్లాంగుదూరంలో పోగడిన పెద్దగుంపు, అతడి నడకను ఆపుచేసింది..."ఏమిటాగుంపు?"- అని అటువైపునుంచి వస్తున్న ఒక వ్యక్తిని రంగయ్య అడిగాడు!

"దొంగనోట్లు పట్టుకొన్నారట"—ఆ వ్యక్తి వివరాలు చెప్పకుండానే వెళ్ళిపోయాడు!

రంగయ్యగుండె జల్లుమంది! కానీ అదేమో చూడాలనే ఆదుర్దా అతడ్ని పీల్చి పిప్పిచేస్తూంది. గుండె దడ, దడలాడుతూంటే, ఆ గుంపుదగ్గరకు అతడు నెమ్మదిగా చేరుకొని, ఒకమూలగా నిల్చుని జరిగేది చూస్తున్నాడు.

అక్కడ పోగయిన జనాన్ని దూరంగానెట్టి - అప్పటికే పట్టుకొన్న పెట్టెను పోలీసు అధికారులు తెరచి ఉంచారు! పెట్లోంచి - సరికొత్త అయిదురూపాయల నోటుకట్టలు బయటకు తొంగిచూస్తున్నాయ్! ఆ నోటను పెట్టెలోపెట్టి తీసుకువస్తున్న వ్యక్తి, అందరి సమక్షంలో ఘరానాగా నిల్చుని-అందరివంకా యగాదిగా చూస్తున్నాడు.

"మొత్తం లెక్కించవోయ్"—సర్కిలు యినస్పెక్టరు ఆజ్ఞాపించటంతోటే, ఒక పోలీసు కానిస్టేబుల్, కట్టలు లెక్కించి, "మొత్తం లక్షరూపాయలకిమ్మత్తు"వన్నాడు.

"ఈ కటలను ఎవరికి మోసుకుపోతున్నావ్?"-సర్కిలు యినస్పెక్టరు ఆ వ్యక్తివయిపు చూసి అడిగాడు!

రంగయ్య గుండె దడ, దడలాడుతూంది! అతడికి తన ప్రాణాలు-ఎదుటి వ్యక్తి అరచేతిలో వున్నట్లు అనిపిస్తూంది! అదృష్టం యేలాగున్నా-తాను అంత్యస్థితిగాని పొందటంలేదుకదా? కొంపముంచి—ఆ వ్యక్తి తన పేరు చెప్పడుకదా? అలా చెప్పినపక్షంలో-తనముందు జీవితంఅంతా—నాశనంఅయిపోతుంది!

రంగయ్య అనుమానానికి తోడుగా - ఆ నోట్లను తీసుకొనివచ్చిన వ్యక్తి, గుంపులోని ప్రతీమనిషివంకా యెందుకో పరిశీలనగా చూస్తున్నాడు! అతడి దృష్టి రంగయ్యమీదకూడా పడింది! అంతే! తనకుతాను యిరుకున పడ్డాననుకొన్నాడతను!

రంగయ్య కృంగిపోతూ, "నన్ను రక్షించవలసినపూచీ నీదేసుమా"-అన్నట్లుగా ఆ వ్యక్తివంక చూశాడు! రంగయ్యకిప్పుడు భగవంతుడు కూడా జ్ఞాపకంవచ్చాడు.

గుస్తీలో మెల్లి అన్నట్లుగా—యింతవరకూ—అంటిపెట్టుకొనివున్న అదృష్టంలో చివరిభాగం-తిరిగి రంగయ్యకు చివరిసారిగా అదృష్టాన్ని కలిగించింది: రంగయ్యచేసిన సౌంజ్ఞలు యిటు పోలీసులుకానీ, అటు సర్కిలు యినస్పెక్టరు కానీ-గుర్తించలేదు! అయితే అసలు వ్యక్తిమాత్రం గుర్తించి, నమ్మకస్తులకు-ముప్పు తెప్పించ నన్నట్లుగా నవ్వాడు!

పోలీసు అధికారులు, మరోమారు ఆ వ్యక్తివంకచూసి: "ఈ నోట్లను యెక్కడికి మోసుకుపోతున్నావోయ్?"-అని ప్రశ్నించారు.

జవాబూ ఆ వ్యక్తి మాట్లాడలేదు!

"పోనీ యీ నోట్లను ఎక్కడనుంచి తెచ్చావో చెప్పు? నీవు నిజం చెప్పినపక్షంలో కొంచెం శిక్ష తగ్గించేం ఏర్పాటు చేయగలను"—సర్కిలినస్పెక్టరు యీ మాటలంటూంటే,

"మీ ఇష్టంవచ్చినట్లు చేసుకోండి. నేచెప్పేది ఏమీ లేద"న్నట్లుగా పకపక నవ్వాడా వ్యక్తి!

పోలీసువారికి కోపం వచ్చింది: "ఇప్పుడు-ఇక్కడ నువ్వెందుకు చెబుతావు? అవసరమర్యాదలు నీకు జరిపిన తర్వాతే - అన్నీ బయటపెడతావు... ఊ స్టేషనుకు నడు"—అని సర్కిలినస్పెక్టరు అనగా, ఒక పోలీసు కానిస్టేబుల్ పెట్టెను యధాతథంగా మూసివేశాడు!

పోలీసులు పట్టిన ఆ నోట్లపెట్టెను—ఆ వ్యక్తిచేతికిచ్చి-జైలుకు నడక సాగించారు. చుట్టూ పోగయిన మనుషులు: "ఎవరిహక్కు అని...మొనగాళ్లునోట్లు ముద్రిద్దా మనుకొన్నారు? ఎప్పటికైనా ఈలాగే పాపం బద్దలయి తీరుతుంది."-అంటూ వాళ్లవెనకనే పోలీసుస్టేషనుకు నడక సాగించారు.

రంగయ్య ధైర్యం అంతా ఏమైందో మరి; అతడు మిల్లు వయిపుకు తిరిగి నడుస్తూ: "ఇరవై వేలూ పోతే పోయాయి కానీ-నాకా పాపిష్టి సొమ్ము మాత్రం వద్దు...బ్రతికి బయటపడ్డాను. అంతే చాలు! నా పేరు యెక్కడ బయటపడుతుందో అని నా గుండె ఝల్లుమంటూంది"—అనుకొన్నాడు.

* * *

రంగయ్య మిల్లుదగర కొచ్చేసరికి యించుమించు అయిదు గంటలైంది. అది ఆగిపోయి వుంది. పెద్ద గుమాస్తా, శేషయ్యపంతులు — యజమాని రాకకోసం ఎదురుచూస్తున్నాడు! కూలీలూ ఇంజను డ్రైవరూ ఒకచోట కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు.

వెలవెలబోయే ముఖంతో, మిల్లులో ప్రవేశించిన రంగయ్యకు- శేషయ్య పంతులు చావుకబురు చల్లగా చెప్పాడు!

ఏదో యంత్రం బ్రద్దలయిపోయిందట. దానికిమ్మత్తు ఇరవై వేలరూపాయలట! అది లేకుంటె మిల్లు తిరగదు.

"ఇరవై వేలే" - అంటూ రంగయ్య కుర్చీలో కూలబడ్డాడు. అతడికంతా అయోమయంగా వుంది.

"అవునండి. కొత్తది ఇరవై వేల పైచిలుకండి...ఇప్పుడున్నది సెకండు హేండు సరుకండి...ప్రసాదరావుగారు దాన్ని ఒకమారు వెల్డు చెయించారు కూడాను. అది మార్చామా, మిల్లు మా గొప్పగా పనిచేస్తుందండి"- అన్నాడు డ్రైవరు-అక్కడకు వచ్చి, తనకున్న అవకాశం అంతటినీ వుపయోగించుకుని.

"ఆ యంత్రం ఎంతత్వరగా వేయిస్తే మనకంత లాభమండీ—ఇది మంచి సీజనండి"—అన్నాడు శేషయ్యపంతులు.

"అవును! నిజమే! కానీ డబ్బు?"- నీరసంగా నవ్వాడు రంగయ్య.

"ఎక్కడైనా ప్రయత్నించుదామండి."

"పోనీ చూడండి" అన్నాడు రంగయ్య తలపట్టుకు.

"చిత్తం."

ఈలోగా రంగయ్య కొత్తగాసంపాదించుకొన్న స్నేహితుల్లో ఒకడు - అక్కడకు వచ్చాడు. రంగయ్యకు అతడ్ని చూడటంతోటే యెందుకో భయం వేసింది. ఏలాగో: "మరి పనిలేనప్పుడు మీరంతా ఎందుకూ? వెళ్లి పోండి...పంతులు గారూ...మీరు... నే చెప్పినది చూసిరండి" అన్నాడు!

కూలీలూ, శేషయ్య పంతులు, వగైరాలు నిష్క్రమించారు! ఇప్పుడు అక్కడ, రంగయ్యా, అతడి స్నేహితుడూ మాత్రం వున్నారు. రంగయ్య కొత్తగా సంపాదించుకొన్న స్నేహితుడి వంక చూసి: "కొంచెం వుంటే కొంప లంటుకొనేవి! బుద్ధిలేక యిటువంటి వ్యాపారం చేయటానికి యిష్టపడ్డాను. నాకేమీ వద్దు" అన్నాడు.

"అరే! అలా ఖంగారుపడతారేమిటి? మీకు లక్ష రూపాయలూ అక్కర్లేదా? మీకు ముట్టచెబుదామని నోట్లు తెచ్చానే"-తోలుసంచిలోంచి ఆవ్యక్తి కొత్తనోట్లను తీయబోయాడు!

"నాకేమీ వద్దు. ఇష్టమయితే నా డబ్బు నాకిచ్చివేయండి. లేకుంటే—" రంగయ్య ఆగిపోయాడు.

అవతల వ్యక్తి రంగయ్య మాటలను మరోవిధంగా అర్థం చేసుకున్నాడు. "లేకుంటే-మమ్మల్ని పట్టిస్తారా?"— అన్నాడతను గాంభీర్యంగా.

అతగాడ్ని బెదిరించినపక్షంలో తన సొమ్మయినా కలసివస్తుందేమో ననుకొని, "ఆ"-అన్నాడు రంగయ్య

"అయితే సరే! మీ యిష్టంవచ్చినట్లు కానివ్వవచ్చు; మేం కటకటాల మధ్యకు నడవటానికి - అవసరమైతే ప్రాణానికి ప్రాణం యివ్వటానికి యెప్పుడూ సిద్ధంగానే వుంటాం. అందువల్ల మీ మాటలు మాకేవిధంగానూ భయం కలిగించవ్. అయినే ఒకటి-మీరూ మాతోకలయవలసి వస్తుంది. మా గురించి మీరు వెల్లడిచేసినప్పుడు-మీ గురించి మేం వెల్లడిచేయవలసి వస్తుంది..."

—ఈ మాటలతో రంగయ్య దారికి వచ్చాడు గొప్పయిన ధైర్యంతో: "బాబ్బాబు! ఆపని మాత్రం చేయకండి. బ్రతికివుంటే బలుసాకు కూర తినవచ్చు; మీ కెంతయినా పుణ్యం వుంటుంది. ఇరవై వేలూ పోతే పోయాయి-కానీ నా పేరు మాత్రం బయటకు రానీయకండి" అన్నాడు.

అవతలవ్యక్తి నవ్వి, తోలుసంచి సర్దుకుంటూ: "ఆ...అమాటే మీరు మనసులో వుంచుకోండి. మీరు మాకపకారంచేయ తలపెట్టారా ... మీకూ అంతే! మాగతి ఏమయినా - మీరు కిమ్మనక వూరుకున్నా రా-మీజోలికి మేంరాం. సెలవు-" అంటూ నిష్క్రమించాడు!

"లెఖ్ఖపోతేపోయింది...నే బ్రతికి బయట పడ్డాను అది చాలు—" అనుకుంటూ రంగయ్య ఆలోచనలో పడ్డాడు!

* * *

మర్నాటి మధ్యాహ్నం, రెండు గంటలవేళ-రంగయ్య ప్రేయసి సరళమ్మ యింటికి బయలుదేరాడు! గతరాత్రి నుంచీ అతడు మిల్లునుంచి బయటకు వచ్చింది లేదు! నడుస్తూన్నా ఏమిటేమిటో ఆలోచనలతో అతడి బుఱ్ఱ చిందరవందర వుతూంది కొత్త యంత్రం అమర్చితేగానీ మిల్లుపని చేయదు! దానికి వలసిన మొత్తం కోసం-శేషయ్యపంతులు యెక్కడెక్కడో తిరిగి వచ్చాడు-కానీలాభం లేకపోయింది!

చేతిలో తిరిగే మొత్తం గూడా యేదీ కన్పటంలేదు! అర్థంలేకుండా ఇరవై వేల రూపాయలు వాళ్ళచేతిలో పోసి చావు తప్పి, కన్నులొట్టయినట్లుగా బయటపడటం జరిగింది.

తాను చేసిన అప్పు పదివేలు-సాధ్యమైనంత త్వరలో తీర్చేయాలి!

గతంలో తాను వొళ్లుమరచి ప్రయత్నించాడు, ఇక మీదట జాగ్రత్తగా ప్రవర్తించి, వున్నదిదక్కించుకోవాలి!

ప్రస్తుతం, మిల్లుపని చేస్తే నే-తన చేతిలో యేదోరకం డబ్బు కనపడుతుంది! ఆడబ్బు కన్పించితే రకం యేలాగో తిప్పవచ్చు! తనదగర పదివేల బాపతు అయిదు వేలు మాత్రం వున్నాయి.మరో పదిహేను వేలు వుంటే యంత్రంవస్తుంది;ప్రస్తుతం పనికిరాటువంటి ఆటంకాలూ వుండవు. ప్రేయసి సరళమ్మ దగర తనదిచాలా డబ్బువుండాలి. తాను కోరినప్పుడల్లా ఆమెకు నోట్లను గుప్పించాడు; కాని ఆమె తన అవసరాలు తీర్చటంలేదు! ఏదో యిచ్చి, "మరి నాదగ్గర యెక్కడ వున్నాయ్"—అంటూంది.ఇప్పుడు యేదోవిధంగా బ్రతిమాలి-ఆ పదిహేను వేల మొత్తాన్నీ ఆమె దగ్గర తీసుకోవాలి!

ఈలా ఆలోచిస్తూ, రంగయ్య ప్రేయసి, సరళమ్మ యింటికి చేరుకొన్నాడు:

* * *

రంగయ్యను చూసి-సరళమ్మ బ్రహ్మానందాన్ని ప్రదర్శిస్తూ "మీకోసం యెదురు చూస్తున్నాం... సామాను సర్దుకోవటమై పోయింది-" అంది! సామాను సర్దుకోవటమేమిటో రంగయ్య కర్థంకాలేదు!

"ఏమిటి విశేషం? -" ఏలాగో చిన్నగా-చిరునవ్వు నవ్వాడు రంగయ్య!

"ఇదిగో చూడండి-"అంటూ ఒక వుత్తరం, తెచ్చి, సరళమ్మ-రంగయ్యకిచ్చింది. "ఇంగ్లీషులో వున్న ఆవుత్తరాన్ని చూచి: "నాకిది చదవటంరాదే"-అన్నాడు రంగయ్య.

"చదవటంరాదు కానీ నోట్లు లెక్కపెట్టడం చేతొచ్చు. పోనీ నేనే చెబుతాను!—" నవ్వి, సరళమ్మ చెప్ప సాగింది:

"నాఅందం, చందం సినీమాకు పనికివస్తాయని మీ రేన్నిమార్లనలేమూ?"

"జా"నన్నట్లుగా రంగయ్య బుఱ్ఱ వూపాడు!

"నేను అదృష్టవంతురాలినవటం వల్ల—అవకాశం దానంతట అదేకలసి వచ్చింది"

"అంటే—"

"మద్రాసులో వుంటున్న మాబావ... ఒకఫిల్ముస్టూడియోనుంచి యీ వుత్తరం వ్రాసాడు...షేరు వేయిరూపాయల చొప్పున — పదిషేర్లు కొన్నవాళ్ళకు వాళ్ళుతీయబోయే సినీమాలో వేషం యిస్తారట. నేఅందంగా వుంటాను గనక—నాకు హీరోయిన్ వేషం తప్పకండాయిస్తారు గనక-ఆమొత్తం పుచ్చుకొని, మద్రాసు వచ్చేయవలసిందని—అతడు వుత్తరంవ్రాశాడు. ఆ లెఖ్ఖ తీసుకొని-నేయీమేలుకు మద్రాసు పోవాలి! ఇక నానివాసం మద్రాసులోనే"—ఈలాసరళమ్మఅంటూంటే అయోమయస్థితిలోవున్న రంగయ్య—నిర్ఘాంతపోయాడు. సరళమ్మతో యేం మాట్లాడటానికీ అతడికి తోచ లేదు.

"ఇంతకీ—నేనీవూరునుంచి వెళ్ళిపోతున్నాను కనుక—మీకూ నాకూ యింతటతో సరి కనుక—మీరు తీసుకువెళ్ళిన ఎనిమిది వేలకుతోడు, మరోరెండు వేలు వేసి, పదివేలు సర్దుబాటుచేయండి. మద్రాసువెళ్లి-నేనొక సారుసయాక,మీ మొత్తం, మీకు జాగ్రత్తగా పంపిస్తాను. మీ డబ్బు నాకనవసరంకూడా" ఇంతవరకూవున్నదంతా - తనకపార్జితమే అన్నట్లుగా, అంది సరళమ్మతిరిగి!

రంగయ్యకళ్లల్లో నీళ్ళుతిరిగాయి— ఇంతకాలం—తానే సర్వస్వం గా భావిస్తున్నానని చెప్పిన సరళమ్మయిప్పుడింత డీసింగా అంటూంది!

"అన్నీ నువ్వేఅనుకొని నాసర్వస్వం నీచేతిలో వుంచుతున్నాను. పెట్టుబడి పెట్టిన యిరవై వేలూ యెగిరిపోయాయ్. ఆకూపంలోంచి బ్రతికి బయటపడటం బ్రహ్మాండమైంది. మిల్లుయింజను పాడిపోయి యిరవై వేలఅనుకోని దెబ్బతగిలింది. మొత్తం ముప్పై వేలుంటే ప్రస్తుతావసరాలన్నీ తీరుతాయి. కట్టుకున్న యిల్లాలున్నా—నాసర్వస్వం యింతవరకూ నీచేత నేవుంచాను. నాకష్టాన్ని గుర్తించి సహాయపడతావని నేపెద్దగా అనుకుంటూంటే..." రంగయ్య యీ విధంగా తనబాధను వ్యక్తపరుస్తూ యేమిటో చెప్పబోయాడు

కానీ, అవకాశవాదినియైన సరళమ్మ అతడిమాటలు నిర్లక్ష్యంచేసి: "ఇంతకీ మీకిచ్చిన ఎనిమిది వేలకీ యోగక్షేమం పెడనా మనుకుంటున్నారన్నమాట! ఇంతలోవుంది,మీమగవాళ్ల బుద్ధి. సరి...ఏంచేస్తాను., రోటిలో తలపెట్టాను కనుక ఆనష్టం నేఅనుభవించవలసిందే"-ఈలా ఆమెఅంటూ ప్రయాణసన్నాహంలోపడింది!

రంగయ్య తెల్లబోయాడు: "నువ్వీవిధంగా చేయటంధర్మంగా వుందా సరళమ్మా?"

"ధర్మం ఏమిటి? నాబ్రతుకుదెరువు నేచూసుకోవద్దూ? అవకాశం లభ్యమయినప్పుడు నా చిరకాలవాంఛితం నెరవేర్చుకోటం తప్పనియెవరంటారు?"—సరళమ్మ యీ మాటలంటూండగానే, వీధిలోకి బండివచ్చి ఆగింది.

"బండి వచ్చిందమ్మా"—ఎవరో బయటనుంచి కేక వేశారు.

"లోపలకొచ్చి సామాను తీసుకుపొండి"—సరళమ్మఅంది. వాళ్లువచ్చి సామానుతీసుకు,బండిలో వేయసాగారు!

"ఇంతకీ నువ్వు వెళ్ళటం తప్పనిసరి అంటావ్" రంగయ్య ఓ నిశ్చయానికి వచ్చి అన్నాడు.

"తప్పనిసరి ఏమిటి...వెళ్ళిపోతూంటే..." సరళమ్మ మరి నిగొప్ప యేం వున్నదన్నట్లుగా వ్యంగ్యంగా నవ్వింది.

"వెళ్ళిపోతున్నావ్! అయితే నా డబ్బు నాకు పడేసి కదులు."

"నీ డబ్బు! నీడబ్బు యెప్పటిదప్పుడే నీముఖాన పడేశాను...నా దగ్గర నీదో కానీలేదు"—ఈలా ఏకవచన ప్రయోగం చేసిన సరళమ్మ అప్పటికే బండిలో సామాను సర్దటంవల్ల—విసురుగా యింటి బయటకువచ్చి, బండి యెక్కింది.

రంగయ్యకూడా వీధిలోకి వచ్చాడు. సరళమ్మ బండి ముందుకు సాగిపోతోంది! బండి వాపుచేసే ధైర్యం కానీ, ఆమెతో తర్కంలోకి దిగే ఓపిక కాని అతడికి లేకపోయాయ్!

* * *

మర్నాడు-ప్రొద్దుట-

మిల్లు ఆఫీసులో రంగయ్య తల పట్టుకు కూర్చుని యేమిటో యోచిస్తున్నాడు. తానింత వున్నవాడుగా పైకి కన్పడుతున్నా యేమీ లేనివాడుగా ప్రస్తుతం వున్నాడు...మిల్లు తిరిగి పనిచేయటానికి కొత్త యంత్రం కావాలి! అంటే యిరవై వేలు కావాలి! తాను చిల్లర, చిల్లరగా తెచ్చిన అప్పులు మరో యిరవై వే లుంటాయ్! అందులో కనీసం ముందుగా ముప్పై వేలయినా వుంటే తన పరువు ప్రతిష్టలు దక్కుతాయ్! మిల్లు పనిచేస్తుంది. అది పనిచేసిందా—తాను యేలాగో రకం త్రిప్పకోకలుగుతాడు. ఏలాగయినా ఆ ముప్పై వేలూ సాధించాలి! అడిగినవాళ్లను అడక్కుండా తాను అప్పులకోసం ప్రయత్నిస్తున్నాడు.

ఇప్పుడు ఆలోచించి చూస్తూంటే—తన పలుకుబడి తగ్గిపోయినట్లుగా తనకే తోస్తూంది. తాను మనస్ఫూర్తిగా వలచిన సరళమ్మ తనది కాకుండా పోయింది! ఆమెతో తన సర్వస్వం గూడా పోయింది! ఇప్పుడు యేం అనుకుంటే యేం లాభం? సరళమ్మమీద వున్న మమకారంచేత నేకదా—పదిహేను సంవత్సరాలకాలం—తన కష్టసుఖాల్లో పాలుపంచుకొన్న రంగజమ్మను తాను హోరున ఏడ్పిస్తున్నది.

—రంగయ్య యీలా పిచ్చిగా వూహిస్తూంటే, శేషయ్య పంతులు అక్కడికి వచ్చాడు. అతడి రాకతో రంగయ్య తలంపులు మారినాయ్. అతడు ఆదుర్దాగా పంతులువైపు చూశాడు.

"ఏం పని జరగలేదు రంగయ్యగారూ! ఎవళ్లిమట్టుకు వాళ్ళు 'లేదు' అంటున్నారు! ఎక్కువ వడ్డీ ఆశ కూడా చూపించా!"

"అయితే నేను సర్వనాశనమయ్యానన్నమాటే"—రంగయ్య ఖంగారుగా అన్నాడు.

"నే ఓ సలహాయిస్తాను వింటారా రంగయ్యగారూ!"—శేషయ్య పంతులు, అతడివైపు చూచాడు.

"ఓ తప్పకుండా!"

"మన స్థలానికి బేరంవచ్చింది! సగానికి సగం లాభం"—పురుషోత్తమయ్యగారి క్కావాలిట! మీ రంగీకరిస్తే ఈ వేళే డబ్బిచ్చేస్తారు. పదివేలు చేతపడతాయ్."

రంగయ్య దూరం ఆలోచించకుండా అనేశాడు. "ఆ పనయినా త్వరగా చేసిపెట్టండి శేషయ్య పంతులుగారూ! చేబదులుగా తెచ్చిన పదివేలయినా ముందు యిచ్చి గౌరవం దక్కించుకుంటాను."

"చేబదులు యేమిటండీ?"

"ఏముందీ? ఆదాయం లభించలేదు కానీ—ఆ కొత్త"—రంగయ్య రహస్య విషయం చెబుతున్నందుకు నాలుక కరుచుకు "ఏం లేదులెండి! ముందు వూళ్ళో యింటికి పదండి. ఆ దస్తావేజులిస్తా...తిరిగి వాటిని వ్రాయించి రేపు రిజిస్ట్రీషను చేయిద్దాం"—అన్నాడు. శేషయ్య పంతులు కతడిమాటలు అర్థంకాలేదు. కానీ యజమానితో యింటికి బయలుదేరాడు. ఈ మధ్యకాలంలో రంగయ్య యింటికి వెళ్ళిందిలేదు. మార్గమధ్యంలో పోస్టుమేన్ కనిపించి-రంగయ్యకు మిల్లుటపా యిచ్చాడు...అతడు శేషయ్య పంతులి కాయుత్తరాలను యిచ్చాడు. శేషయ్యపంతులు అందులో ఒకవుత్తరం తీసిచదివి: "ఫైరుఇన్సూరెన్సు ప్రీమియం రెండోవాయిదాకట్టాలండి" అన్నాడు. మూడుమాసాల కొకమారుకట్టేటట్లుగా, రంగయ్య యిన్సూరు చేశాడు.

"అప్పుడే"—

"వాళ్లు మనకు ముందుగా జ్ఞాపకం చేస్తుంటారండి! అయినా మొదటి ప్రీమియం కట్టి మూడునెల్లవుతూంది కాదండీ! దీనికి ఓ నెల్లాళ్ళ వ్యవధి వుంటుందిలెండి."

"నెల్లాళ్ళ వ్యవధి వుంటుందీ... అయితే బాధేలేదు"-రంగయ్య ఏమిటో ఆలోచన - చేయటం సాగించాడు. వచ్చిన వుత్తరాలగురించి నడకసాగిస్తూ-శేషయ్యపంతులు ఏమిటో చెబుతున్నా అతడి దృష్టి ఆ మాటలమీద లగ్నం అవలేదు.

* * *

దీర్ఘకాలం తరువాత-రంగయ్య యింటికి వచ్చినందుకు-రంగజమ్మ వ్యక్తపరచలేని ఆనందం అనుభవించింది. సరళమ్మ లేచిపోయిన సంగతి ఆమెకూ తెలిసింది. భర్తను తిరిగి తన వాడిని చేసుకోవాలని, ఆమె అమాయకంగా అనుకుంది.

ఇంట్లో ప్రవేశిస్తూనే-రంగయ్య తన తప్పిదాన్ని భార్య, రంగజమ్మ ముందు వొప్పుకొని-మరి ముందు,ముందు - కంటికి రెప్ప విధంగా ఆమెను చూసుకుంటానని మాట యిచ్చాడు.

రంగయ్య యేవో కాగితాలు వెతుకుతూవుంటే, శేషయ్యపంతులుద్వారా రంగజమ్మ అసలు విషయాన్ని తెలుసుకుంది.

"నామాట విను! ఆ కొన్న స్థలాన్ని అమ్మవద్దు! మనకామిలు అచ్చిరాదు! అయినకాడికి అమ్మి సొమ్ముచేసుకో"-బతిమాలే ధోరణిలో రంగజమ్మ భర్తతో అంది!

"నా కనవసరంగా కోపం తెప్పించక ఈ పట్టుకు నా యిష్టప్రకారం జరపనీ! ఆపైన నీ మాట"—అన్నాడు దస్తావేజులు శేషయ్యపంతులు కిస్తూ, రంగయ్య.

భర్త అనురాగం వాంఛిస్తున్న ఆ భార్య రంగజమ్మ ఆ ప్రత్యేక పరిస్థితిలో "సరే నీయిష్టం" అనటం తప్పనిసరియైంది!

"ఆ...నా రంగమ్మ మంచిది! ఇక మీద నేయిల్లు కదల్ను..." అన్నాడు రంగయ్య! ఆ మాటలు అతడు అక్షరాలా ఆచరించాడు!

మర్నాడుస్థలంరిజిస్ట్రీషనయింది.పదివేల రూపాయలూ, రంగయ్య చేతులో పడ్డాయి. శేషయ్య పంతులుచేత తాను చేబదులుగా తెచ్చిన చోటకు ఆ మొత్తం జమచేయటానికి పంపుతూ, మరి కొంత సొమ్ము యిచ్చి "ఇన్సూరెన్సుకు కట్టండి"-అన్నాడు రంగయ్య!

"ఏం ఇన్సూరెన్సండి"— శేషయ్య పంతులు ఖంగారుగా అడిగాడు.

"మిల్లుదయ్యా"

"అది ఖంగారు లేదుకదండీ." ఒకమూల మిల్లు..." పంతులు యేమో చెప్పబోయాడు.

"ఖంగారేమిటయ్యా. కట్టమంటూంటే"-రంగయ్య యీలా అనటంతోటే అతడి ధోరణి అర్థంకాని, శేషయ్యపంతులు చెప్పినట్లుగా చేశాడు!

* * *

ఆ తరువాత జరిగిన సంగతులు వివరంగా మనకనవసరం. కానీ జరిగిన సంగతులు యివి: రంగయ్య ఏభైవేలుపోసి కొన్న మిల్లు మరో మాసం అనంతరం హఠాత్తుగా-అగ్ని దేవుడి దయకు పాత్రురాలైంది.! ఇరువై వేల పైచిలుకు యంత్రం అవసరంఅయి ఆగిపోయిన ఆ మిల్లు కాలినవైనం-(ఏలా కాలిందీ) రంగయ్యకు మినహా మరియెవరికీ తెలియదు! అయితేనేం ఫైరు యిన్సూరెన్సువారు-తగిన బలవత్తర ఆధారాలు కానీ, సాక్ష్యాలు కానీ దొరకనందువల్ల ఏబదివేల కిమ్మత్తుకుకొన్న ఆ మిల్లుకు పరిహారంగా కనీసం అయిదు వేలయినా ముదరా యివ్వలేదు! కావాలని మిల్లు యజమానే ఆ పని చేసుకొన్నట్లుగా వాళ్ళు నిర్ణయానికి వచ్చారు!

ఒకనాడు మిల్లుయజమానియైన రంగయ్యకథ ఈ విధంగాపూర్తిగా అడ్డు తిరిగింది. అదృష్టం-ఆ స్తమానూ అతనివద్దే వుంటుందా? ఆ విధంగా లేనప్పుడు అతడు మాత్రం యేంచేయ కలుగుతాడూ?

మిల్లు తిరిగి పునరుద్ధరించటానికి యేవిధంగానూ అవకాశం లభించని రంగయ్య-దగ్ధమైన ఆ స్థలాన్ని అమ్మకానికి పెడితే నాలుగున్నర వేలకంటె యెక్కువ రాలేదు. చిల్లర చిల్లరగా తెచ్చిన అప్పులు తీర్చటంకోసం-రంగయ్యయింటికొన్న-చిల్లర సామాను సహితం అమ్మి పారేయటం తప్పనిసరి అయింది. ఫైరు ఇన్సూరెన్సు వారిచ్చిన మొత్తం-చిల్లరి అప్పులకే జమయింది.

మరేంవుంది.? ఒకనాడు మిల్లుయజమాని అయిన రంగయ్య శేషయ్య పంతుల్ని పోషించలేకపోయాడు. అంతే కాదు. తిరిగి బ్రతుకు తెరువు కోసం-యేదో ఒక మిలులో కూలీగా ప్రవేశించటం అతడికి తప్పనిసరియైంది! మిల్లు యజమాని రంగయ్య తిరిగి మిల్లు కూలీ అయ్యాడు! అతడికి స్వార్జితం గా-పూర్వపు పూరిగుడిసె, పది హేనుపదహేరు సంవత్సరాలనుంచి కాపురం చేస్తున్న భార్య, రంగజమ్మ-యేవో చిల్లర సామానూ మిగిలాయి.

(కథలోని పాత్రలు పూర్తిగా కల్పితం)

# తన అదృష్టాన్ని అందరితో పంచుకోగలిగిన ఆదర్శజీవి



"రోజులు మారాయి" చిత్రంలో నాగేశ్వరరావు.

**శ్రీ బెజవాడ గోపాలరెడ్డి**

చిన్న వయస్సులోనే అక్కినేని నాగేశ్వరరావు అరవై చిత్రాలలో నటించిన సందర్భంలో తన ఆనందాన్ని అభిమానులకు, మిత్రులకు, పోషకులకు తెలుపుచు ఒక ఉత్సవం ఏర్పాటు చేయుట చాలా ముదావహం ఇది కేవలం గర్వసహితమైన ఉత్సవం కాదు. వారు ఉద్దేశించిన ప్రకారం తన అదృష్టమునకు సహాయభూతులైన పెద్దలకు అభినందనాలు ఇస్తున్నారు. ఈ సందర్భంలోనే వారు ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు ఇరవైఐదు వేలు రూపాయలు భూరివిరాళము ఒసగి ఆంధ్రావని అంతకు ఆనందం కలిగించుటకు ఉద్యుక్తులగుట మరింత సంతోష కారణము.

తన అదృష్టాన్ని తానే అనుభవించక అనేకమందితో వారు తమ అదృష్టాన్ని పంచుకుంటున్నారు. నాగేశ్వరరావును ఆహ్వానించి ఫిలిములను తయారుచేయించిన అనేకమంది లాభపడిరి. దీనికి మూలధనమొసగి ఇతర సహాయం చేసిన డిస్ట్రిబ్యూటర్లు లాభపడిరి. సినిమాహాలు యజమానులు లాభపడిరి. సినిమాకు పోయిన పెద్దలకు తమడబ్బు వృథాఅయిందని అనుకోకుండా వారూ ఆనందాన్ని పొందగలిగినారు. ఒకరి అదృష్టం అనేకమంది ఐశ్వర్యానికి, ఆనందానికి కారణం అవుతుందని చెప్పడానికి ఇదొక నిదర్శనం. ఈనాడు వారు ఆర్జించిన సొమ్ములో కొంత భాగం ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు అందజేయడంకూడా నాగేశ్వరరావు కళాసక్తి, పాండిత్యాసక్తికి నిదర్శనము. ఒక చిరంతనమైన విషయాన్ని సాధించడానికి విశ్వవిద్యాలయాలు కృషిచేయగలవు. అట్టి శాశ్వతకృషికి వీరీనాడు సహాయం చేయుచున్నారు.

ఒక ఉత్తమనటుడుగా కేవలం ఆంధ్రప్రదేశ్ లోనే గాక ఇతర ప్రాంతాల్లో కూడా ప్రఖ్యాతివహించి, మఖలో పుట్టి పుబ్బలో నశ్శించిపోయే ప్రఖ్యాతిగాక, పది పంద్రెండు సంవత్సరాలు అనేక సందర్భాలలో తన శిల్పనైపుణ్యాన్ని ప్రదర్శించి ప్రజలయొక్క ఆదరణను ఎక్కువగా పొందినవారు నాగేశ్వరరావు అన్న అతిశయోక్తి గానేరదు.

అది కేవలం పండితులకేగాక, లేక అక్షరాస్యులకేగాక నిరక్షరాస్యుల, మారుమూలలనున్న పల్లెసీమల ప్రజల హృదయాలను కదిలించే తత్వంలో వీరు నటించి తాత్కాలికముగానైనా వారి దుఃఖభారమును విస్మరించేటట్లు చేయగలిగినారు కొబట్టే వారినిచూచినవారికి, చూడనివారికి కూడా చిరపరిచితులైనారు. పెద్దలకన్న, అల్పవయస్కులలోనే వారన్న అభిమానము హెచ్చుగా కనిపిస్తున్నది. ఆనందానికి కారణభూతులైన బాలాభిమానమును చూరగొన్న మేటి నటుడు నాగేశ్వరరావు.

విభిన్నములైన పాత్రలను వహించి శృంగార, విషాద, హాస్య, కరుణాది నవరసములను ప్రదర్శించి తెరమీద మూర్తీభవించిన ఆవేశమా? కళానైపుణ్యమా? అనునట్లు భ్రమింపజేసిన అదృష్టనటుడు నాగేశ్వరరావు. ఎంతెంతమంది నిరుత్సాహాన్నో, దుఃఖాన్నో, నైరాశ్యాన్నో తొలగించినవి వారు ప్రదర్శించిన చిత్రములు. పల్లెసీమ ప్రజలు వారికి తెలియని కొన్ని విషయాలు తెలుసుకొని కొంత నాగరికతను అలవరచుకొని చిత్రరికాపాన్ని కొంతపొంది ఆనందించారో వారి చిత్రపటములు చూచి?

స్త్రీలు, పురుషులు, పిన్నలు, పెద్దలు అను తారతమ్యం లేక అందరి సమాన ఆదరణకు వారు పాత్రులయ్యారు. ముదినేపల్లి ఉన్నత పాఠశాలలో స్త్రీ పాత్రను వేయుచు ప్రారంభించిన తన కళాజీవితం ఈ రీతిగా ద్వాదశవర్షములలో తన శత

(10 వ పుట చూడుడు)

# వెంకటరాఘవపురం పంటచేలనుంచి ఆంధ్రసహృదయుల సమక్షానికి—

నేను కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా వెంకటరాఘవపురం అనే చిన్న పల్లెటూరులో 20-9-1924 న జన్మించాను. మాది సామాన్య రైతుకుటుంబం. మా తండ్రిగారు అక్కినేని వెంకటరత్నంగారు. మా అమ్మ పున్నమ్మగారు. ఆ దంపతులకు పుట్టినవారందరూ మగవాళ్లే. వారిలో నేను కడగొట్టు కొడుకును. నా అయిదవ ఏటే మా నాన్నగారు చనిపోయారు. నా యోగక్షేమాలను మా పెద్దన్న శ్రీ రామబ్రహ్మంగారే చూస్తూవుండేవారు. నా 12వ ఏట మా ఊరుగూరు పెదవిరివాడలో చదువు మొదలుపెట్టాను. మా ఊరి పిల్లలు ఏటేటా స్కూలులో నాటకాలాడేవారు. మా అన్నయ్యకు నాటకాలంటే అభిమానం. అమ్మకు ఆడపిల్లలంటే అమితప్రేమ. నటనంటే నాకూ ఏదో అర్థంకాని సరదా. ఇంకేం. పిల్లల నాటకంలో వేషంవేశాను. అంతా బాగుందని మెచ్చుకున్నారు. మా అన్నయ్య, అమ్మ ఆనందానికి అంతులేదు. అదే నా నటజీవితానికి నాంది.

తరువాత రెండవఫారం చదువుతూ ఉండగా హిందీ మాధ్యమిక పరీక్ష పూర్తిచేశాను. అప్పుడే, మా ప్రక్క ఊరు "నుదరపల్లి"లో కొందరు మిత్రులు "కనకతార" నాటకం ప్రదర్శించే ప్రయత్నాలు చేస్తున్నారు. అన్నయ్య ఆ నాటకంలో 'తార' వేషం వెయ్యమన్నాడు. ఆడపిల్లవేషం గనక, అమ్మకూడా తలూపింది. సాగుతూన్న చదువు మానేసి, నాటకరంగంలో ప్రవేశించడం నాకంతగా నచ్చలేదు. "కాని చదువు సాగించినందువల్ల ఉన్న నేల కాస్తా పోవడమేగాని, నువ్వుచేసే పెద్ద ఉద్యోగాలేమిటి"ని వారి వాదం. పెద్దవాళ్లమాట శిరసావహించి, ఆ నాటక సమాజంలో చేరి, బాగా ప్రాక్టీస్ చేసి, కనకతార ప్రదర్శించాం. చూచిన వారంతా బాగుందన్నారు. నా వేషానికి ప్రత్యేక ప్రశంస వచ్చింది. ఇక మా వాళ్ల సంతోషం చెప్ప శక్యంకాదు. ఈ నాటకాలలో అభినయిస్తూ, విశ్రాంతి దొరికినప్పుడల్లా పొలంపనికి వెళ్తూ ఉండేవాణ్ణి. నేను వ్యవసాయం చెయ్యడం అన్నయ్యకు ఇష్టం లేదు. పేరు ప్రతిష్ఠలున్న నటులు పాల్గొనే పెద్ద నాటక సంఘాలలో ప్రవేశపెడితే నేను త్వరగా పైకి రాగలనని వారి భావం. అందుకోసం పనిగట్టుకుని ప్రఖ్యాత నటులతో నాకు పరిచయం కలిగించారు. ఆ ఫలితంగా శ్రీ స్థానం, శ్రీ మాధవపెద్ది, శ్రీ సూరిబాబు మొదలైన ప్రముఖ నటులతో కలిసి, నాలుగైదు నాటకాలలో వేషాలు ధరించి నటించాను. వేసినవి చిన్న వేషాలైనా, నన్ను వారు అభిమానించారు. మా అన్నయ్యకు వాళ్ళు ఏమి చెప్పారోగానీ, ఆయన ఉత్సాహం, సంకల్పం, మరి కొంత బలపడినై—నన్ను నటుడుని చెయ్యాలని.

అప్పుడు ధర్మపత్ని చిత్రం తీస్తున్న శ్రీ పి. పుల్లయ్యగారికి నాకేదైనా అవకాశం ఇప్పించమని శ్రీ కొజ వెంకట్రామయ్యగారి చేత సిఫారసు చేయించారు. వారూ అంగీకరించారు. కొల్హాపూర్ పంపించారు. రెండు మాసాలు గడిచిన తర్వాత బడి పిల్లలు ఆడుకునే ఒక ఘట్టంలో వారితోపాటు నేను పాడుతూ ఆడుకున్నాను. ఆ చిత్రంలో నేను చేసిన పని అంతే.

ఇంటికి వచ్చేశాను. అప్పుడు రామచంద్రపురం నుంచి వచ్చిన శ్రీ వై. భద్రాచార్యులుగారు, గుడివాడలో నాటకసంఘం పెట్టి, నాటకాలాడుతూ ఉండేవారు. వారివద్ద నన్ను మా అన్నయ్య ప్రవేశపెట్టారు. నేను కొద్ది గొప్ప మాటే వాణ్ణి. శ్రీ మోటూరు వీరరాఘవయ్య, మునిస్వామి గార్లవద్ద పాటలూ, పద్యాలూ నేర్చుకున్నాను. శ్రీ భద్రాచార్యులుగారి సమాజంలో పెద్ద నటుల మధ్య చాలా ఆడవేషాలు వేశాను. వారందరూ నన్ను ఎంతగానో ప్రోత్సహించేవారు. క్రమంగా నాకూ ధైర్యం ఏర్పడి, నటించాలనే ఆశా, శ్రద్ధా కలిగినై.

ఈ పరిస్థితుల్లో శ్రీ కడారు నాగభూషణంగారు "తల్లి ప్రేమ" చిత్రం నిర్మిస్తూ, అందులో ఏదో వేషం ఉందని తీసుకువెళ్ళారు. కొన్నాళ్లున్న తర్వాత ఆ వేషానికి, పదహార్లే వయసున్న నేను పెద్దవాణ్ణని నిర్ణయించారు. దాంతో కథ కంచికీ - నేనింటికీ. మామూలు నాటకాలు ప్రారంభించాను. నాకు లేని ఆశాభంగం, నిరుత్సాహం, మా అన్నయ్యకు కలిగినై.

తర్వాత గుడివాడలో శ్రీ బుద్ధిరాజు శ్రీరామమూర్తిగారు బడిపిల్లలతో వేయించిన "విప్రనారాయణ" నాటకంలో 'దేవదేవి' పాత్రను నటించాను. ఆ నాటకం చూచినప్పుడు ప్రస్తుతం అన్నపూర్ణా పిక్చర్సు అధినేత శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు, సినిమా నటులు శ్రీ కొడూరు అచ్చయ్యగార్లు నాకు రజతపాత్రలనుబహూకరించారు. నన్ను వారి కంపెనీలో నాయికపాత్ర వేయడానికి రమ్మన్నారు. వారు గుడివాడ తాలూకా ముదినేపల్లిలోని "ఎక్సెల్షియర్ డ్రమెటిక్ అసోసియేషన్"కు నన్ను తీసుకువెళ్లారు. అక్కడ శ్రీ పెండ్యాల నాగేశ్వరరావు సంగీతదర్శకులుగా, శ్రీ కె. గోపాలరావు మేకప్‌మాన్‌గా వుండేవారు. "ఆశాజ్యోతి" అనే నాటకాన్ని ఆరు మాసాలు ప్రాక్టీసు చేశాం. ఆ సాధనలో శ్రీ అచ్చయ్యగారు నాకు ఎంతో సహాయపడ్డారు. నాటకం ప్రదర్శించాం. ప్రశంసపం పొందింది. తరువాత "సత్యాన్వేషణం", "తెలుగుతల్లి" నాటకాలు కూడా ప్రాక్టీస్ చేసి, ఆంధ్రదేశంలో వివిధ కేంద్రాల్లో ప్రదర్శించాం. మా రంగస్థలంమీద నటించిన నాకు కంపెనీకి నుంచి పేరూ ప్రఖ్యాతీ వచ్చినై. ఈ కాలంలో నటననుగురించి, రంగస్థలంమీద నటుడు, క్రమశిక్షణా బద్ధుడై ఎంత మహోజ్వల భవిష్యత్ ను సృష్టించుకోగలడోనన్న విషయాల్ని గురించీ ఎంతో నేర్చుకున్నాను. ఆ సమయంలో నేనూ, శ్రీ మధుసూదనరావుగారూ చాలా సన్నిహితులమైనాము. నన్నెంతో ఆదరంతో చూడడమేగాక, నా జీవిత పురోగమనానికి కావలసిన సంస్కారసామగ్రిని సమకూర్చారు. వారు నాకు మా అన్నయ్య లాటివారే.

"ఒకనాడు తెనాలిలో నాటకప్రదర్శనం ముగించుకుని, గుడివాడకు వెళుతూ, దారిలో బెజవాడ స్టేషనులో ఉన్నాం. అక్కడ ప్రతిభా పిక్చర్సు అధినేత శ్రీ ఘంటసాల బలరామయ్యగారు, వారి కెమేరామాన్ శ్రీధర్ గారూ నన్ను చూచారు. 'సినిమాలో నటించడానికి వస్తావా' అని అడిగారు. 'మా పెద్దవాళ్లతో మాట్లాడ'మన్నాను. అందరం కలిసివెళ్లాం. మా వాళ్లు అంగీకరించారు. కాని ఆడవేషాలు వేస్తూన్న నేను వారి "సీతారామజననం"లో, "శ్రీరాముని వేషం" ధరించాలి అనేటప్పటికి, నాకు సందేహమూ, భయం కల్గాయి. మా అన్నయ్య పట్టుదల, శ్రీ మంగయ్యగారి ధైర్యవచనాలు నన్ను ప్రోత్సహించాయి. శ్రీ మధుసూదనరావుగారి సలహాపై నెలకు ఇరవై రోజులు మద్రాసులో వుండేటట్లు, మిగతా పదిరోజులూ నాటకాలు వేసుకునేటట్లు ఏర్పాట్లు చేసుకున్నాం.

1944 వ సంవత్సరం మేనెల 8 వ తేదీన మద్రాసు వచ్చాను. ప్రతిభా పిక్చర్సులో జీవితం మొదలుపెట్టాను. అతర్వాత శ్రీ బలరామయ్యగారు అనుమతి ఇవ్వనూలేదు. నేను నాటక ప్రదర్శనాలకు వెళ్ళనూ లేదు: అక్కడ నాటక కంపెనీ నడవనూ లేదు.

ఇక్కడ సీతారామజననం ప్రారంభమైంది. వేషం వేసుకుని, కెమేరా ముందు నిలబడ్డ నాకు వణుకు ఆరంభమైంది. వేలాదిజనం ముందు మా రంగస్థలంమీద నటించిన నాకు ఇక్కడ కాలు నిలవలేదు. ఒళ్ళంతా ముచ్చెమటలు పోసినై నన్ను నేనే గిల్లుకుని ధైర్యం చెప్పుకున్నాను. 'రెడీ' అన్నారు. మాటు తీశారు. "ఓ. కె" అని బలరామయ్యగారు వెన్ను తట్టారు. అంతటితో వణుకు తగ్గింది. ఆ ప్రథమ చిత్ర నటనానుభూతి, ఆ ఘడియలు, అప్పటి మనోభావాలూ, ఇప్పటికీ, తర్వాత, ఇప్పటికీ నేను మర్చిపోలేదు. చిత్రం విడుదలైన తర్వాత ప్రజలేమనుకున్నారో నాకు తెలీదు. కాని, నా అడుగడుకలు కులుకులు పలుకులూ పట్టివ్వ లేదనే నిర్మాతలు చెప్పారు.

సీతారామ జననం తీస్తూ ఉండగానే మాయలోకం నిర్మించదలుచుకున్న శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారికి నావయసుగల హీరో కావలసి వచ్చాడు. శ్రీ మధుసూదనరావుగారి ప్రయత్నమూ, శ్రీ చల్లపల్లి రాజావారి సిఫారసువల్ల నన్నా చిత్రంలో హీరోగా తీసుకున్నారు. మాయలోకం సగభాగం పూర్తయిన తర్వాత శ్రీ రామబ్రహ్మంగారికి నామీద అవ్యాజానురాగం కల్గింది. నన్ను వారింటిలోనే ఉండమన్నారు. నన్నెంతో ప్రేమతో చూసేవారు. ఎంతో పెద్దవాణ్ణి చేయాలని ఆశపడుతున్నట్లు చెపుతూండేవారు. నేను కూడా ఆ చిత్రంలో హేమా హేమీలైన నట నటీమణుల మధ్య పడి రాణిస్తే నా భవిష్యత్ కు సుస్థిరత ఏర్పడుతుందని ఆత్మవిశ్వాసంతో, పట్టుదలతో, అందరి ఆదరాభిమానాల కోసం కృషిచేశాను.

నా మొదటి అయిదు చిత్రాలవరకూ శ్రీ రామబ్రహ్మంగారూ, శ్రీ బలరామయ్యగారే సినిమా పరిశ్రమలో నాకు బాగా తెలిసిన నా శ్రేయోభిలాషులు. వారిద్దరికీ నేనెంతో ఋణపడివున్నాను. అది తీర్చుకునే అవకాశం నాకు లభించేముందే వారిద్దరూ ఒకరితర్వాత ఒకరు ఈ ప్రపంచంలో ఋణం తీర్చుకుని వెళ్ళిపోయారు. ఈ నాటికీ వారికి నేను ఋణస్థుణ్ణిగానే

(10 వ పుట చూడుడు)



చలనచిత్ర నటుడికి తీరుబాటు, విశ్రాంతి అన్నవి దాదాపు అందని పండ్లు. కాని, నాగేశ్వరరావు తను నటించే చిత్రాల సంఖ్య నెలకు ఆరుకు పరిమితం చేసుకుని, వాటిని సాధించాడు. పిల్లలకు కబుర్లూ కథలూ చెబుతున్న నాగేశ్వరరావు. అతని కుమారుడు వెంకటనారాయణ, కుమార్తె సత్యవతి.



నాగేశ్వరరావు పాల్గొన్న 60-వ చిత్రం "దొంగల్లో దొర."

చలనచిత్ర నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు తాను పాల్గొన్న 60 వ చిత్రం విడుదల అయిన సందర్భాన్ని పురస్కరించుకొని చిత్ర నిర్మాతలకూ, తోటి కళాకారులకూ, తనను ఆదరించిన ప్రజలకూ కృతజ్ఞత తెలుపడానికై ఈరోజున చలనచిత్ర వజ్రోత్సవం జరుపుకొంటున్నారు.

# ఆంధ్రదేశానికి వన్నెతెచ్చిన నటుడు-నాగేశ్వరరావు

**శ్రీ పి.వి.రాజమన్నారు**

శ్రీ అక్కినేని నాగేశ్వరరావు గారితో స్వయంగా నాకు అంతగా పరిచయం లేకపోయినా వారు నటించిన చిత్రాలు అనేకం చూచినందువల్ల ఒక విధంగా వారు నాకు ఒక పాత స్నేహితుడని చెప్పవచ్చును.

బహుశా ఆయన నటించిన చిత్రాలలో సగమైన పైచిలుకు చూచివుంటాను.

ఇంత చిన్న వయస్సులో ఇన్ని చిత్రాలలో నటించిన వ్యక్తి ఆంధ్రులలో ఇంకొకరు లేరేమో.

కేవలం సంఖ్యలోనే గాకుండా నటనాకౌశలంలో ఆంధ్రదేశానికి వన్నెతెచ్చిన నాగేశ్వరరావు అత్యంత ప్రశంసనీయుడు.

పాత్రోచితమైన అభినయం, ఉచ్చారణ సౌష్టవం, శ్రావ్యమైన కంఠం, సౌలభ్యం ఉట్టిపడే అంగవిన్యాసం—ఇవన్నీ నాగేశ్వరరావుగారికి దైవ ప్రసాదితములు. అయినా, వారు ప్రతి చిత్రంలోనూ ముందుకన్న మిన్నగా నటించాలని యత్నం చేస్తున్నట్లు కనబడుతుంది. ఇక ముందు ఇప్పటికన్న గొప్పగా నటించగలరన్నీ, ఇంతకన్న గొప్ప స్థాయిని అందుకొనగలరన్నీ నా విశ్వాసం.

ఐతే ఈ సందర్భంలో ఒక ముఖ్య విషయాన్ని విస్మరించరాదు.

ఒక నటుడు ఎంతటి ప్రతిభా

(10 వ పుట చూడుడు)



శ్రీ నాగేశ్వరరావు, కుమార్తె నాగసుశీల, కుమారుడు వెంకటనారాయణ, పెద్దకుమార్తె సత్యవతి, భార్య శ్రీమతి అన్నపూర్ణ.

## ఆంధ్రసహృదయుల సమక్షానికి...

(9వ పుట తరువాయి)

...డిపోయాను.

"తల్లిప్రేమ"కు వచ్చినప్పుడే పరిచయులైన శ్రీ డి. యల్. నారాయణ గారు- భరణీవారి ప్రథమచిత్రం "రత్నమాల"లో నటించే అవకాశం కల్పించారు. ఆ తర్వాత ఆ సంస్థలో ఆరు చిత్రాల్లో నటించాను. నేను ఎక్కువ చిత్రాల్లో పాల్గొన్న సంస్థ అదే.

అప్పటికే యుద్ధమేఘాలు పూర్తిగా విచ్చిపోవడం, దేశంలో శాంతి సుఖాలు ఏర్పడడం, వర్తక వ్యాపారాలు విరివిగా సాగడంతో, సినిమా పరిశ్రమకు కూడా క్రొత్త బలం, క్రొత్త చైతన్యం, వచ్చింది. ఎందరో క్రొత్త నిర్మాతలు, క్రొత్తనటులు, క్రొత్తరకం చిత్రాలు, క్రొత్త క్రొత్త విలాసాలూ, వెలుగులూ వచ్చినై. అనేక సమస్యలను పరిశ్రమా, పరిశ్రమలో పనిచేసే మా నటవర్గమూ ఎదుర్కోవలసి వచ్చింది. క్రొత్తరకం చిత్రాలకోసం నిర్మాతలు, ఆ పాత్ర ప్రదర్శనకోసం మేమూ అహోరాత్రాలు కృషిచేశాం. అలాగే వాగులూ వంకలూ దాటుతూ, మిట్టలూ పల్లాలూ ఎక్కి దిగుతూ, ఈనాటికి అరవై చిత్రాలలో నటించాను. ఈ మాట నేను మనవిచేసేది నాతో సన్నిహిత సంబంధంకల పారిశ్రామికులకూ, సోదర నటవర్గానికే గాదు. నావలె ఆశలు పెంచుకుంటూ సినిమా పరిశ్రమలో చేరి, పేరు ప్రఖ్యాతులు సంపాదించుకో దలచుకున్న యువకులకు చెబుతున్నాను. కష్టం చెప్పుకున్నానే గాని, గొప్పకోసం చెప్పడం లేదు. నేటి ఆనందం సులభంగా వచ్చిందికాదు. నటజీవితం పూవుల సెజ్జ అంతకుముందే కాదు. ...నిక విజయాలకోసం కత్తిగట్టిపోరాడే ...జీవితానికీ, కళావిజయానికి గజ్జకట్టి ఆడే నటజీవితానికీ తేడాలేదనే నా ఊహ. నా అనుభవం కూడా అంతే. పౌరాణిక చిత్రంతో రంగప్రవేశంచేసి, జానపద చిత్రాలలో శిక్షణపొంది, సాంఘిక సమస్యాచిత్రాలలో మానవ భావాలను ఎదుర్కొని, భిన్న విభిన్న ప్రకృతులుగల పాత్రలను నటించవలసినప్పుడు నేను పడినబాధలు, చేసిన సాధన, దర్శకులు చేసిన సాహాయ్యం చాలామందికి తెలీదు. ఏ ఒక్క చిత్రంలో, నిర్మాత నన్ను ఎన్నికోవడం పొరబాటయినా, ఏ పాత్రాభినయంలో నైనా నేను తప్పటడుగు వేసినా, ఆ చిత్రమూ, నిర్మాత, నేనూ పరాజయం పొందవలసిందే. మళ్ళీ ప్రజలముఖం చూచే అవకాశం ఉండదు.

కత్తిమీద సామువంటి కళాసాధనలో నేనలాటి పరీక్షలకే గురైనాను. బాలరాజునుంచి బాలచంద్రుడు ఒక గంతు. వీరరస ప్రధానమైన ఆ పాత్రనుంచి లైలామజ్నులో భగ్నప్రేమికుడైన ఖైస్ పాత్రకు మరో గంతు. ఆ పాత్ర నిర్వహణలో నేనెంత మథన పడ్డానో తలుచుకుంటే, ఈ నాటికీ నా ఒళ్లు పులకరిస్తుంది. ఆ తర్వాత నే నెన్నుకొన్న మరొకపాత్ర సంసారంలో. ఇంతవరకూ సంపాదించుకున్న ప్రజాదరం సాంఘిక చిత్రంలో ఎక్కడ చేజారిపోతుందో అని క్షణ క్షణమూ వణికిపోయేవాణ్ణి. ఆ చిత్రం విజయవంతమైన తర్వాత సాంఘిక చిత్రాలంటే బెదురుపోయింది. ఏపాత్రనైనా నటించగలనన్న ఆత్మవిశ్వాసం, ధీమా కల్గింది.

లైలామజ్ను తీసే రోజుల్లో నే నాకు వివాహం జరిగింది. దెందులూరు వాస్తవ్యులు శ్రీ కొల్లిపర వెంకటనారాయణ గారి కుమార్తె అన్నపూర్ణాదేవిని 1949 సంవత్సరం ఫిబ్రవరి 18వ తేదీన వివాహమాడాను. మాకిప్పుడు ముగ్గురు సంతానం. ఇద్దరు ఆడపిల్లలు సత్యవతి, నాగసుశీల. ఒక మగపిల్లవాడు వెంకటనారాయణరావు. నా నటజీవితంలో కళారాధనకు పూర్తిగా నన్ను అంకితం చేసుకుని, రోజుకి రెండు, మూడు కాల్ షీట్సుకూడా పనిచేస్తూ ఒక్కొక్కప్పుడు వారాలతరబడి ఇంటిపట్టున అరగంట కూడా వుండలేకపోతూ, నా స్వంత జీవితంలో అర్థంగాని ఆవేదనపడిన సమయాలున్నాయి. కానీ, నటుడు కళాతపస్సులో నిమగ్నుడయిపోయాకా, లక్ష్యసిద్ధికోసం, కొన్ని త్యాగాలు అవసరమని స్వానుభవంవల్ల గుర్తించాను.

తర్వాత నేను నటించినచిత్రాలలో, ఒకే రకానికి చెందిన అన్నదమ్ముల పోలికలున్న పాత్రలు అనేకం నాపాల బడినై. వాటిలో గల వైవిధ్యానికి లోపం రాకుండా, విశిష్టత కనిపించేలాగు నటించవలసివచ్చింది. ఆ లక్ష్య సాధనలో ఆయా చిత్రాల దర్శకులు ప్రత్యేక శ్రద్ధ చూపించి, నాకు కళాసిద్ధి కల్గించారు.

నన్ను కలవరపెట్టిన మరొకచిత్రం "పల్లెటూరి"-అంతవరకూ వేసినవి పడుచు వేషాలు. ఈచిత్రంలో మునసబు వేషం నడక, ఉచ్చారణ వచ్చింది. చాలా ఇబ్బందిపడ్డాను. కన్నతల్లిలో వేషం కష్టమైనా, పల్లెటూరి వాతావరణంలో పుట్టిపెరిగిన నా కది నల్లేరుపై బండినడకగా సాగిపోయింది. నా అభిమాన వేషాల్లో అదొకటే.

"దేవదాసు" చిత్రం వచ్చింది. నాలోనూ, దేశంలోనూ గాలి దుమారం రేగింది. నేనాపాత్ర నిర్వహణకు పనికిరానని చాలామంది సందేహాలు వెలిబుచ్చారు. అనేకమంది ఆక్షేపించారు. ఆ ఆక్షేపాలే నాలో పట్టుదలను పెంచాయి. ఇంతమంది కాదన్నపనిని జయప్రదంగా నిర్వహించాలని ప్రత్యేక శ్రద్ధతో నా సమస్త శక్తులనూ కేంద్రీకరించి కృషిచేశాను. నా శ్రమ ఫలించి, చిత్రం తెలుగు, తమిళ భాషలలో అఖండవిజయం సంపాదించింది. నిర్మాత, దర్శకులు, సాంకేతికవర్గం, సోదర నటవర్గం, ఈ చిత్రవిజయానికై ఎంతో కృషిచేసి సాయపడ్డారు. ప్రజానీకం ఉత్తమ చిత్రాన్ని, సమిష్టి కృషిని, భేదభావాలు, వ్యక్తిగత అభిప్రాయాలు, అసూయలూ లేకుండా ఎంత మెచ్చుకుంటుందో, నీరాజన మిచ్చి ఎంతగా హర్షించి, ఆనందిస్తుందో తెలుసుకున్నాను.

తర్వాత ప్రత్యేకించి చెప్పుకోదగ్గ ఘట్టం, విప్రనారాయణ, మిస్సమ్మ, అర్ధాంగి, దొంగరాముడు, రోజులు మారాయి, అనార్కలి, భలేరాముడు, తెనాలి రామకృష్ణ మొదలగు చిత్రాల్లో ఒకేసారి నటించవలసి వచ్చింది. ఆ చిత్రాల్లోని నా పాత్రలు ఎలాంటివో మీరందరూ చూసినవే. ఒకేసారి అంత విభిన్న ప్రకృతులుగల పాత్రలను (ఒకోనాడు రోజుకు రెండు మూడు కాల్ షీట్సు కూడా ఉండేవేమో) నటించవలసి వచ్చేది. వేషాలైతే క్షణంలో మార్చగలను కాని, మనసు, ఆవేశం మార్చుకోవడం ఎలా? ఒక పాత్ర స్వభావం మరొక పాత్రమీద పడేది. అడుగడుగునా విభ్రాంతి కలిగి, సలహాకోసం దర్శకులవైపు చూచేవాణ్ణి. వారు నన్ను దారిలో పెట్టేవారు. నేను ముందుకు నడిచి వెళ్లేవాణ్ణి. కొన్ని చిత్రాలలో మాటలెక్కువై, పలుకుబడికోసం బాధపడితే, "చరణదాసి" "ఇలవేలుపు" చిత్రాలలో మాటలు తక్కువై, భావప్రదర్శనమే ప్రధానమైన పాత్రలు నటించవలసి వచ్చింది. అట్లాంటప్పుడు చెమటలుపట్టి అవస్థపడి, దర్శకుల సహాయంతో బయటపడేవాణ్ణి. ఈ వివిధ ప్రకృతులు గల పాత్రలనుంచి నేను నేర్చుకున్నది ఇంతా అంతా కాదు.

ఆ తర్వాత "తోడికోడళ్లు", "సావిత్రి", "అల్లావుద్దీన్", "మాయాబజార్", "సువర్ణసుందరి", "దొంగల్లో దొర" చిత్రాలతో నేటికి అరవై చిత్రాలు పూర్తి అయినై.

ఈ చిత్రజీవిత సంగ్రామంలో జయించినప్పుడల్లా ఏనుగెక్కినంత సంబరంతో పొంగుతూ - చిత్రం ప్రజాదరం పొందనప్పుడు వైకుంఠపాళిలో పాములతో చెలగాటంలా క్రుంగిపోతూ, నా లక్ష్యాన్ని మరువకుండా, విడవకుండా సాధన చేశాను. ఏమి సాధించానో నిర్ణయించే రసికులు మీరే. ఆశీర్వదించమని ప్రార్థిస్తున్నాను. వినమ్రుడనై, నా తరపున, నా కుటుంబం తరపున అంజలి ఘటిస్తున్నాను.



"మిస్సమ్మ"లో నటించిన నాగేశ్వరరావు.



నాగేశ్వరరావు తన ప్రతిభను ఋజువు చేసుకొన్నాడనిపించిన మరొక పాత్ర "సంసారం"లో వేణు.



ప్రపంచ ప్రసిద్ధికెక్కిన విషాదాంత గాథ "లైలామజ్ను" నాగేశ్వరరావు నటజీవితంలో ఒక మైలురాయి.



"విప్రనారాయణ" మంచి పేరు తెచ్చిపెట్టింది.



నట ప్రపంచంలో సుస్థిరస్థానం సంపాదించి పెట్టిన భూమిక "దేవదాసు"

## ఆదర్శజీవి

(9వ పుట తరువాయి)

పత్రములను విప్పి తన పూర్తి సౌరభమును నలుదిక్కులా వ్యాపింపజేసి ఒక రమణీయమైన కమలముగా పరిఢవిల్లుట ఆంధ్రులకు ఈనాడు గర్వకారణమైనది.

నాట్యరంగములో వలెనే సినిమా రంగమునందును తెలుగు నటీనటులు విశిష్టతను పొందారనుట నిస్సందేహం. పురుషపాత్రలు వహించిన అనేకమంది నటులలో నాగేశ్వరరావు మిన్నగా తేలి నటశేఖరుడయ్యాడు.

వారి కళానైపుణ్యముకన్న తెరమీద వారుచూపు చురుకుతనముకన్న, వారిలో నన్ను ఆకర్షించినది-వారి సౌజన్యము, వినయవిధేయత, సత్ప్రవర్తన. ఇన్ని చిత్రాలలో నటించి ఇంత ఐశ్వర్యమును ఆర్జించి, పేరుప్రఖ్యాతులు పొంది నిగర్వచూడామణి నాగేశ్వరరావు అని తనను తెలిసినవారిలోనూ, ఫిలిం నిర్మాతలలోనూ, అజ్ఞాతముగా వున్నప్పుడు తన్ను ఆదరించిన పెద్దల్లోనూ అనిపించుకొనుట చిన్న విషయంకాదు. అది వారి విశిష్టత అని చెప్పవచ్చు.

వారి జీవిత కావ్యంలో తొలి అధ్యాయం పూర్తిఅయింది. తరువాత అధ్యాయం ఇంకా ఎటువంటి రసవత్తరములైన, సౌరభ సమ్మిళితములైన ప్రతిభలను ప్రదర్శించనున్నదో. కాని వారి అభిమానులందరు ఇంకనూ వారికీర్తి ఉన్నత శిఖరములను అందుకోవలెనని ఆశించుచూ ఎదురుచూచుట సహజం.

శ్రీ దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుగారివలెనే ఈ నాగేశ్వరరావును అజాతశత్రువు అన్ననూ తగునేమో. ఆయన వివాదగ్రస్తమైన వ్యక్తికాదు. విరోధులు లేరు. అందరూ స్నేహితులే. అందరూ అభిమానులే. మొత్తంమీద అదృష్టం, కృషి, నైపుణ్యం, వర్తన వీటియొక్క కలయికే నాగేశ్వరరావు. వారు ఈ జీవితములో ఒకస్థాయిని, ఒక సిద్ధిని పొంది తనకృతజ్ఞతను వెల్లడించుచున్న ఈ ఆనందోత్సవ సందర్భమున ఈ నాలుగు మాటలు వ్రాయు అవకాశం కల్పించిన ఆంధ్రపత్రికాధిపతులకు కృతజ్ఞుడను.

# నటుడుగానేగాక వ్యక్తిగా కూడా గొప్పవాడనిపించుకున్నాడు

## శ్రీ నాగేశ్వరరావుకు ప్రముఖుల శుభాకాంక్షలు

నాగేశ్వరరావు చలనచిత్ర వజ్రోత్సవ సందర్భంలో పెద్దలు పలువురు ఆయనను అభినందిస్తూ, శుభాకాంక్షలు తెలుపుతూ సందేశాలు పంపించారు.

### భారత ఉపరాష్ట్రపతి డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ సందేశం

చలనచిత్ర షష్టిపూర్తిని పురస్కరించుకొని మీరు వజ్రోత్సవం జరుపుకొంటున్నారని తెలిసి ఆనందించాను.

చలనచిత్ర రంగంలో మీరు ఎన్నతగ్గ కృషిచేసి ప్రజలమన్ననలు పొందగలరని ఆశిస్తున్నాను. ...

బీదవిద్యార్థుల సహాయార్థం మీరు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో రు 25 వేల నిధి నెలకొల్పడం మీ సౌజన్యాన్ని సూచిస్తున్నది.

మున్ముందు మీరు ఇతోధికంగా సేవచేసి మన్ననపొందగలరని ఆశిస్తున్నాను.

### మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కె. కామరాజ్

నటుడుగా అరవై చిత్రాలు పూర్తి చేయడం ఘనకార్యం. చలనచిత్ర కళ ప్రజాసేవకోక సదవకాశంఅని నమ్మి వ్యవహరించే కళాకారుడు, తనకూ, తనకళకూ వృత్తికికూడా గౌరవప్రతిష్ఠలను చేకూర్చినవాడవుతాడు. శ్రీ నాగేశ్వరరావు,ఒకసత్కార్యానికై ఈనాడు భూరివిరాళం ఇస్తున్నారు. ఇది మిగతా కళాకారులందరికీ ఆదర్శప్రాయం కావడం వాంఛనీయం.

నాగేశ్వరరావు ఇతోధికవిజయాన్ని సాధించాలని నా ఆకాంక్ష.

### ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి

"మీ వజ్రోత్సవ సందర్భంలో నా హృదయపూర్వక అభివందనలు.

మనమిద్దరం రైతుబిడ్డలమే. ఈదృష్ట్యా మనకు సామ్యంఉంది. మన కార్యకలాపాలు, విధులూ భిన్నమైనవైనా, అభిన్నమార్గాలలోనే ఇద్దరం ఎంతో కొంత మంచిపనిచేశామని సంతృప్తి చెందవచ్చు. ఇతర నటీనటులకన్న సన్నిహితుణ్ణి కావడానికి ఇదేదోహదం చేసింది.

మీరు మున్ముందు మరింత వృద్ధి కావాలని ఆకాంక్షిస్తున్నాను.

### శ్రీ ఎన్.జి. రంగా

"...చలచిత్ర పరిశ్రమ ప్రగతికీ, కళా వికాసానికి మీరు దోహదం చేశారు. మీ నటనా కౌశలం, ప్రతిభ, మిమ్మల్ని ఆంధ్ర ప్రజలకేకాక, అందరికీ అభిమానపాత్రుణ్ణి చేశాయి. ఇందుకు నా అభివందనలు.

"...విజ్ఞానాభివృద్ధికి మహత్తర సాధనం అవతగ్గ ఈచలనచిత్రరంగంలో పరిమితులైన మీరు సమాజ వికాసానికి

ఎంతైనా కృషిచేయవచ్చును. ఈ విషయంలో మీరు మరుచిత కృషిచేస్తూ ఉండడం ముదావహం."

### ఉత్తరప్రదేశ్ గవర్నర్ శ్రీ వి. వి. గిరి

"...చిత్రకుడ్డిలో కష్టపడి కృషిచేసి మీరు ఈ నాటి ఈ స్థాయిని అందుకున్నారు. కళాకారులందరికీ మీరు ఆదర్శప్రాయులు.

"...ఆంధ్ర విశ్వవిద్యాలయానికి రు. 25 వేలు విరాళం ఇస్తున్నందుకు అభినందనలు. మీకు నా శుభాకాంక్షలు.

### ఆంధ్ర విద్యామంత్రి శ్రీ పట్టాభి రామారావు

"...ఆంధ్ర విశ్వవిద్యాలయాని కిచ్చిన విరాళం మీ ఔదార్యాన్ని చాటుతుంది. మిగతా వారందరికీ ఇది ఆదర్శం కావాలని ఆశిస్తున్నాను. రెండు రాష్ట్రాల ముఖ్య మంత్రులు పాల్గొంటున్న మీ వజ్రోత్సవం జయప్రదం కావాలని ఆకాంక్షిస్తున్నాను. మీరు చిరకాలం దేశానికి సేవ చేయగలగాలని ఈశ్వరుణ్ణి అర్థిస్తున్నాను.

### శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు

"చిరంజీవి అక్కినేని నాగేశ్వరరావు గొప్ప నటుడు. ఆంధ్రదేశంలో ఎంతో పేరుగడించాడు. అతడు ఇపుడు 60 చిత్రాలు పూర్తిచేశాడని విని చాలా సంతోషించాను. బీదవిద్యార్థుల కోసం అని, అతడు 25 వేల రూపాయలు విరాళం ఇవ్వడం చాలా గొప్పవిషయం. ఇందుకు ఆంధ్ర ప్రజలుసదా కృతజ్ఞులై ఉంటారు.

చిరంజీవి నాగేశ్వరరావు ఇంకా వృద్ధిలోకివచ్చి గొప్పవాడు కావాలని మనస్ఫూర్తిగా కోరుతున్నాను."

### శ్రీ ఎస్. శంభుప్రసాద్

"60...చిత్రాలలో నటించడం,ఇంకా అనేక చిత్రాలలో నటించే స్థాయి కలిగి ఉండడం చాలా ఘనమైన విషయం. ఇది పండుగ చేసుకోవలసిన సందర్భం.

"మీతో కలసి పనిచేసిన వారినీ, మీ కృషి సత్ఫలదాయకము జయప్రదము కావడానికి దోహదంచేసిన వారినీ ఈ రోజున మీరు సత్కరించడం ఉత్తమ సంస్కారాన్ని, సహృదయాన్ని చాటుతున్నది.

"ఆంధ్ర విశ్వవిద్యాలయానికి మీరిచ్చిన భూరివిరాళం, ఉజ్వలకీర్తి కారకం కాగలదు.

"మీరు నూరు చిత్రాలు పూర్తి చేయాలని ఆశిస్తూ, ఆరోజు కై కుంటూ ఎదురు చూస్తున్నాను.

"ఈశ్వరుడు మీకు చిరాయువును శుభోన్నతిని ప్రసాదించాలని కోరుతున్నాను."

## ఆంధ్ర దేశానికి వన్నెతెచ్చిన నటుడు

(9వ పుట తరువాయి)

వంతుడైనా, అతడు ఎంత కృషి చేసినా, అతడు ధరించే పాత్రకు సమగ్రమైనరూపకల్పన జరుగక పోతే ఆ ప్రతిభ, ఆ కృషి ఆశించేటంతగా భాసించవు. ప్రతిభ చూపడానికి తగిన అవధులు ఉండాలి. కృషి చేయడానికి అవకాశం ఉండాలి.

సమర్థులైన ఇటువంటి నటుల ప్రతిభ సద్వినియోగమై శోభించాలంటే ఆయా చిత్రాల ప్రొడ్యూసర్లు, కథలో, చిత్రణలో, పాత్ర రూపకల్పనలో శ్రద్ధవహించాలి, పైతవ్య వంతంగా తీర్చిదిద్దడానికి శ్రద్ధగా పూనుకోవాలి. రచయితలచే ఉత్తమమైన పాత్రలను సృష్టింప చేయాలి.

శ్రీ, కీర్తిశ్రీకూడా వరించి తాను ఇంతటి ఉచ్చస్థాయిని అందుకొన్నా, నాగేశ్వరరావుకు గర్వంలేదు. జాలిగుండె గలవారు. ఉదార దాత.

వారు వజ్రోత్సవం జరుపుకునే సందర్భంలో ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఇవ్వబోతున్న రు 25 వేల విరాళమే వారి సౌజన్యాన్ని, ఔదార్యాన్ని సూచిస్తుంది. ఇకముందు ఇతరా ఇటువంటి ధర్మాలకు ధనం గణించి దానిని వినియోగిస్తారని నావిశ్వాసం.

భగవంతుడు వారికి ఆయురారోగ్యములు ప్రసాదించుగాక. ★

# 'నాగేశ్వరరావు ఉన్నతి ఘటనబలం కాదు



"దొంగరాముడు" చిత్రంలో నాగేశ్వరరావు పరిణతి చెందిన నటనను ప్రదర్శించాడు.

## —నటనఫలం'

### శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు

[అన్నపూర్ణా ("తోడికోడళ్లు", "దొంగరాముడు") పిక్చర్స్ అధిపతి శ్రీ మధుసూదనరావు విద్యార్థిదశనుండి నాటకరంగంతో ప్రమేయంగలవారు. 1936 లో (బందరు నోబుల్ కాలేజి) పట్టభద్రులైనతరువాత, ఎక్సెలిసియర్ క్లబ్ పేరిట ఒకసంఘం నెలకొల్పి ఆంధ్రదేశమంతటా నాటక ప్రదర్శనలు నిర్వహించారు. నటుడు నాగేశ్వరరావు ఆయన నాటకాలలోనే 'నటన'కు ఓనమాలు నేర్చుకున్నానంటాడు. వ్యక్తిగతంగా తా నెరిగిన నాగేశ్వరరావును ఈ వ్యాసంలో పరిచయం చేస్తున్నారు.]

"ఇవాళ 'విప్రనారాయణ' నాటకం ఉందిట. గుడివాడ వెళ్దాం మండీ" అన్నారు పెండ్యాల నాగేశ్వరరావుగారు 18 ఏళ్ళ క్రితం ఒక రోజున క్లబ్బుకొచ్చి.

"తప్పకుండా చూడతగినంత గొప్పదా?" అన్నాను నేను.

"చూస్తే మంచిదనుకుంటాను. మన నాటకంలో ఆడవేషానికి మనిషి కావాలికదా. అందులో నాగేశ్వరరావు అనే కుర్రాడు దేవదేవి వేషం కడుతున్నాడు. బావుంటాడు...బాగా పాడతాడుకూడా... మంచి కంఠం" అన్నారు ఆయన.

ఆ రోజున ముదినేపల్లి నుండి గుడివాడవెళ్ళి ఆ నాటకం చూశాం. దేవదేవి పాత్రధారి నటన చాలాబాగుందని పించిందినాకు. అలాగే అక్కడి కొచ్చిన చాలామందికి అనిపించింది.

కొందరం నాగేశ్వరరావుకు బహుమతులు చదివించి ఆనందం తెలియజేశాము.

నేను, ఇంకోఅడుగు ముందుకువేసి మాసంఘం (ఎక్సెలిసియర్ డ్రామెటిక్ క్లబ్) నాటకాలలో వేషాలు వేయమని అడిగాను.

తక్షణం జవాబు చెప్పలేదు నాగేశ్వరరావు. ఒకక్షణం ఆలోచించాడు. ఇంకోక్షణం నావంక చూశాడు. "మీరు మా పెద్దవాళ్లతో మాట్లాడండి నాకు ఇష్టమే" అన్నాడు.

నాటకాలువేసి బాగుందనిపించుకొనే యువకులు, నలుగురూ ఓహో అనగా విని ఒక విధమైన శేఖాతరీ తరహాలో దురుసుగా వ్యవహరించడం సర్వ సాధారణం. 15 ఏళ్ల నాగేశ్వరరావు ఆ రోజున అంత తాపీగా వినయంగా మాట్లాడ్డం చూచి, మంచి నటుడే కాక, కూశం, మితి తెలిసినమనిషి. ఒకడు మా బృందంలో చేరుతున్నాడని ఆరోజున సంతోషించాను.

* * *

ఈ రోజున గర్వపడుతున్నాను—అతడు 18 ఏళ్ల క్రితం చేపట్టిన కార్యం, నేడు సాధించిన విజయం చూచి.

ఈ అరవై చిత్రాల యాత్రలోనూ అతని అర్హతతోపాటే పేరు ప్రతిష్ఠలూ, ప్రతిభ కూడా క్రమంగా పెరుగుతూ వచ్చాయి. ఈ క్రమాభివృద్ధికి కారణం క్రమశిక్షణగల కృషి. నటుడిగా మంచి స్థాయిని అందుకోవాలన్న పట్టుదలను, అందుకోసం అతడు విధి విరామం లేకుండా చేసిన కృషిని నేను ఎరుగుదును. అది తలచుకుంటే, ఈనాడు నాగేశ్వరరావు సాధించిన ఈ ఉన్నతికి కారణం ఘటన బలంకాక అదృష్టం అన్నమాట సబబు అనిపించదు. ఘటన బలంకన్న ఇది నటనఫలం అన్నదే ఈ నటుడికి వర్తిస్తుంది.

* * *

నాగేశ్వరరావు, అప్పటి మాసంఘం ఆధ్వర్యాన మూడే మూడు నాటకాలు వేశాడు. ఆ మూడూ కలిపి మొత్తం నూటయాభై ప్రదర్శనలు అయ్యాయన్నమాట. అతని తొలి నాటకం వేదాంతం కవి వ్రాసిన "తెలుగుతల్లి" (అంతకుముందు అతడు సతీ సావిత్రి, విప్రనారాయణ, కనకతార నాటకాలు మాత్రమే ఆడాడు.) ఇదే అతడి తొలి సాంఘిక నాటకం. ఆ రోజుల్లో (1940) మా ప్రాంతాల్లో సాంఘిక నాటకాలు ఆడడం బహు అరుదు.

తెలుగుతల్లి నాటకాన్ని ప్రత్యేకం మేము ప్రదర్శించడానికనే వ్రాయించుకున్నాం. "ఆశాజ్యోతి" అనే మరో నాటకం (శ్రీ కోనేరు కుటుంబరావుగారు వ్రాసినది) మరొకటేఉంది. అది అంతకుముందు ఒకసారి ప్రదర్శించాము కాని, అది పాసుగైనందువల్ల, ఆశించినంత విజయం సాధించలేదు. నాగేశ్వరరావు వచ్చాక దాన్ని కొంచెం సర్ది తిరిగి తయారుచేశాం. కాగా 'సత్యాన్వేషణం' అనే మరో నాటకాన్ని సాహిత్య శిరోమణి శ్రీ కూరపనేని సుబ్బయ్యగారు వ్రాసి ఇచ్చారు. దీనికి నాస్తికవాదం ప్రాతిపదిక. ఆస్తి నాస్తి సిద్ధాంతాలలో ఏదో ఒకటి బుజువు చేయాలన్న బ్రహ్మాండమైన సంకల్పం ఉండేదని అనను కాని, కొన్ని మూఢ నమ్మకాలను నిర్మూలించాలన్న భావంతోనే ఆ నాటకం ప్రదర్శించనిశ్చయించాము.

ఈ మూడు నాటకాలలోనూ "ఆశాజ్యోతి" పరిభాష ప్రకారం 'పెద్ద హిట్' అయింది. నాయకి పాత్ర ధరించిన నాగేశ్వరరావు ఎన్నో బహుమతులు, ప్రశంసలూ అందుకున్నాడు.

అయితే అన్నింటిలో అతడు గొప్పగా నటించింది "సత్యాన్వేషణం" లో నని ఇప్పటికీ నేను అనుకొంటూ ఉంటాను.

నాగేశ్వరరావు మా బృందంలో చేరాక చాలా మార్పులు వచ్చాయి. నాటక సమాజాన్ని ముదినేపల్లి నుండి గుడివాడకు మార్చాము. యుద్ధంవల్ల మదరాసునుండి అందరూ వచ్చివేస్తున్న ఆ సమయంలోనే, అపుడు 'తల్లిప్రేమ' చిత్రానికి సహాయ సంగీత దర్శకుడుగా ఉన్న పెండ్యాల నాగేశ్వరరావుగారు, అంతకు కొద్ది రోజులముందే మాసంఘంలో చేరారు. అప్పటిదాకా హార్మనీ, తబలాలతో సరిపెట్టుకుంటూ వచ్చిన మేము, సమగ్రమైన వాద్యబృందాన్ని (మా ప్రాంతంలో అదే తొలిసారి) ఏర్పాటు చేశాము. అంతవరకూ ఆడవేషాలు ధరించడానికి తగిన నటుడులేని మాకు నాగేశ్వరరావు దొరికాడు. స్వతహా మంచి వాడు, శక్తిచేత మంచి నటుడు అయిన ఇతగాడు అచిరకాలంలోనే అందరి అభిమానాన్ని గౌరవాన్ని సంపాదించుకొన్నాడు.

గుడివాడలో, ఇతని కోసమని, అపుడు ఒక భోజన వసతి గృహం కూడా ఏర్పాటు చేశాము. ఆరోగ్యం విషయంలో అతనికి మహాశ్రద్ధ. చిరుతిళ్లు తినడు. శ్రావ్యమైన కంఠస్వరం పాడవుతుందని-నూనె పదార్థాలు అసలు ముట్టుకునేవాడుకాడు. ఇడ్డెన్లు అతని 'ఫలహారం' అపై భోజనం అంతే.

మూడు నాటకాలకూ ఒకసారే 'రిహార్సలు' ఆరంభించాము మేము.

నాగేశ్వరరావు తెల్లవారుఝామునే నిద్రలేచి స్నానాదికాలు ముగించుకుని, కులాసాగా పాడుకుంటూ ఏడు గంటలకల్లా సిద్ధమయ్యేవాడు. పన్నెండు న్నరవరకూ హుషారుగా రిహార్సల్సు సాగేవి. మళ్ళీ భోంచేసి, ఒక గంట విశ్రాంతి తీసుకుని రెండింటికి మొదలు పెట్టి రాత్రి తొమ్మిదింటికి ముగించే వాళ్లం.

ఇలా రోజుకు దాదాపు 15 గంటల సేపు సాధన సాగేది.

కొత్తలో ఒక తమాషా.

పౌరాణికాలతో నటజీవితం ఆరంభించిన నాగేశ్వరరావు ధ్యాస ఎంత సేపూ పద్యాలూ పాటలమీదనే వుండేది. సంభాషణల పలుకుబడి గురించి కాని, నటనలో మెలకువల గురించిగాని, పట్టించుకునేవాడు కాడు. ఆరోజుల్లో నటుడి కీర్తికి "వన్స్‌మోర్"లు గీటురాళ్లు. పద్యాలు పాడితేనే అవి పడతాయి. అందుకని అతనిదృష్టి వాటిమీద వుండేది. మేం ఎవరం లేనపుడు సంగీత దర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావు దగ్గరికి వెళ్లి పద్యాలు పాడడం నేర్చుకునేవాడు. శాస్త్రీయంగా, హాయిగా పాడాలన్న ఆయన మతం కూడా అతనికి గిట్టేదికాదు.



"తోడికోడళ్లు" చిత్రంలో...

'రిహార్సల్'లో ఎప్పుడైనా, అలా కాదోయ్ ఇలాగంటే, ఎప్పుడూ నటన గురించే చెప్తారు. పద్యాలసంగతి పట్టించుకోపోతే ఎలా అనేవాడు.

ఆ నాగేశ్వరరావు అచిరకాలంలోనే మారిపోయాడు. అంటే అతడు కొత్తగా నటన నేర్చుకున్నాడని కాదు. అది అతనికి స్వతస్సిద్ధంగా అబ్బిన విద్య. ఎటొచ్చీ అభిప్రాయం మార్చుకున్నాడు. నటన కూడా ప్రధానమని గ్రహించాడు. దీనికికారణం, అతడు నాటకంలో వేషం వేసినపుడల్లా, ఎంతో మందివచ్చి, బాగా నటించావు అని మెచ్చుకోవడం.

ఒక్క బ్లూ నా పద్యాల గురించి పాటల గురించీ మాట్లాడరెంచేత అనేవాడు నాగేశ్వరరావు తిక్కగా.

అతనికి వచ్చే బహుమతులు కూడా నటనపేరుతోనే వచ్చేవి.

ఆ తరవాత అతడు నటనలో మెలకువలు తెలుసుకోవడానికి పూనుకున్నాడు. ఊళ్లోగాని, చుట్టుపక్కల గాని ఎక్కడైనా స్థానం, డి. వి. సుబ్బారావు ప్రభృతుల నాటకాలు వస్తే, నాగేశ్వరరావు హాజరుకావడం ఖరారు.

ఇటు లేనబసలోకూడా సాధన చేసేవాడు. మాటామంతీకూడా సర్వదా నాటకం గురించే. అప్పట్లోనే శ్రీ బి. వి. నరసింహారావుగారి దగ్గర స్త్రీ పాత్రధారణలో మెలకువలు ఎన్నో నేర్చుకున్నాడు.

ఇక, సంభాషణల పలుకుబడిలో ఎందరిసలహాలోతీసుకొనేవాడు...అన్నీ గమనించి, సౌలభ్యం సాధించ ప్రయత్నించేవాడు.

అప్పుడప్పుడు స్వగ్రామం వెళ్లి తల్లినీ అన్నలను చూచి రావటంతప్ప, వేరే పనులేం లేవు, బాదర బందీలు అసలే లేవు. ఈ విధంగా, అతని అభిలాషకి అవకాశం తోడైంది.

అప్పట్లో నటవర్గం హుషారుగా పని చేయడానికని కొన్ని బహుమతులు ఏర్పాటుచేశాము. తెరఎత్తడానికి అరగంట ముందుగా ముస్తాబు పూర్తిచేసుకు సిద్ధమైనవాళ్లకి ఒక బహుమతి. స్టేజిమీద 'ప్రాంప్టింగు' అవసరం లేకుండా నటించిన వాళ్లకి ఇంకొకటి. ఈతరహా బహుమతు లెపుడూ ఇతడే గడించేవాడు. ప్రాంప్టింగ్ అనేది అతనికి ఎన్నడూ అవసరం ఉండేది కాదు. సరిగదా నాటకంలో అన్ని భూమికల సంభాషణలూ కంఠతా పట్టేసి, ఎవరు మాట మర్చిపోయినా, చాకచక్యంతో వాళ్ల సంభాషణ అందిచ్చి ఆపదలో ఆదుకునేవాడు.

ఈ సందర్భంలోనే ఇంకొక్క ముక్క గుర్తుకొస్తోంది. పాఠశాలలకు సంస్థలకు సహాయం చేయడానికి నాటకం వేయాలని ఎవరన్నా కోరితే, ఇతను తక్షణం ఒప్పుకునేవాడు. ఖర్చు తగ్గించడానికి, తన రుసుము వదులుకునేవాడు. అలా మా బృందం కృష్ణా, ఉభయ గోదావరి జిల్లాలలో కొన్ని నాటకాలు ప్రదర్శించింది. అప్పట్లో జాతీయోద్యమానికై కూడా కొన్ని నాటకాలువేశాము. పాలకొల్లులో ఉన్నత పాఠశాల సహాయార్థం, నాగేశ్వరరావు ప్రోత్సాహంమీద ఐదు నాటకాలువేసి నిధి సేకరించాం. అక్కడివారంతా ఇప్పటికీ నాగేశ్వరరావు గురించి ఎంతో అభిమానంతో చెబుతారు.

ఇలా మూడేళ్లు హుషారుగానే సాగిపోయింది. నాగేశ్వరరావు శక్తి, దాంతోపాటు పేరూ నానాటికీ పెరిగింది. స్థానం నరసింహారావు ప్రభృతులంతా అతని నటన చూచి మెచ్చుకున్నారు.

మెప్పులకు ఎన్నడూ మురిసిపోయి తృప్తిపడేవాడు కాదు నాగేశ్వరరావు. ఇపుడూ ఇంతే.

అమలాపురంలో నీ వేషం బాగుందోయ్ అంటే, నరసాపురంలో నాటకం ఆడిన తరవాత, "అమలాపురంనాటికన్నా మెరుగేనా?" అని అడిగేవాడు. అవునంటే ఓహో అని ఊరుకునేవాడు.

కాదంటే, సాధించాలని పట్టు పట్టి, తరవాతసారి ఔననిపించుకునేవాడు.

ఇప్పుడూ అంతే.

అతని నటజీవితం అంతా ఇలాగే సాగుతోంది.

సరే తరవాత ఒకరోజున బెజవాడ స్టేషనులో కీ॥ శే॥ ఘంటసాల బలరామయ్యగారు అతన్ని చూచారు. దగ్గరకు పిలిచి, తాము తీస్తున్న సీతారామజననంలో రాముడివేషం వేస్తావా అని అడిగారు.

నాగేశ్వరరావు ఒకక్షణం ఆలోచించాడు. నావంక చూచాడు. ఆయన వంక చూచాను.

"మావాళ్ళదగ్గరకు వెళ్దాం రండి. వారితో మాట్లాడుదురుగాని" అన్నాడు.

మూడేళ్ళక్రితం గుడివాడలో "విప్రనారాయణం" నాటకం వేసినపుడు, నేనతన్ని పిలిచిన సన్నివేశం గుర్తుకొచ్చింది నాకు.

'ఇప్పుడూ అంతే' అనుకున్నాను.

* * *

తరవాత అతను రాముడు వేషం వేశాడు. బలరామయ్యగారు, మొదటి రోజునే 'భేష్' అని భుజం తట్టి ఇంటికి పోగొట్టారు.

తరవాత, స్వర్గీయ గూడవల్లి రామబ్రహ్మంగారు, తమ "మాయలోకం" చిత్రంలో కొత్త నటుడిని పరిచయం చెయ్యాలని సంకల్పించడం జరిగింది.

ఒకటి రెండు సిఫార్సుల ద్వారా నాగేశ్వరరావును బుక్ చేశారు. కాని కొన్నాళ్లపాటు, అతని శక్తిమీద ఆయనకు గురి కుదరలేదు.

షూటింగ్ జరుగుతునే ఉంది. సెట్ మీద శ్రీ గోవిందరాజుల సుబ్బారావుగారి వడిగి సుళువు చిలువులు తెలుసుకుంటూ కొన్నాళ్ళు నటించాడు.

ఇదికాక, ఇంటిదగ్గర కష్టపడి సాధన చేసేవాడు. ఒకరిద్దరు పెద్దల సహాయంతో మాటల పలుకుబడి, నటనలో సౌలభ్యం సాధించ ప్రయత్నించాడు.

అపుడు నేను గుడివాడలో ఉన్నాను.

ఒక రోజున హఠాత్తుగా ఉత్తరం వచ్చింది రామబ్రహ్మంగారి దగ్గర్నుంచి. అర్జంటుగా రమ్మన్నారు నన్ను. కారణం ఏమిటో బోధపడలేదు. నాగేశ్వరరావు నటన ఆయనను తృప్తి కలిగించలేదనుకున్నాను.

నేను మద్రాసు రాగానే, రామబ్రహ్మంగారు, నన్ను న్యూటోన్ స్టుడియోకి తీసుకువెళ్లి, 'మాయలోకం' రషెస్ చూపించారు. బావున్నాయని పించింది నాకు.

"క్షేమంగా నటించాడు కుర్రాడు" అన్నారు ఆయనే. అలా అని, "అతనికి చెప్పకేం ఇపుడే చెబితే కుర్రాడు పాడైపోతాడు" అన్నారు.

సరే అన్నా నేను. ముగ్గురం మళ్లీ కారులో తిరిగి వస్తున్నాం.

"అబ్బాయ్, బాగచేశావు. క్షేమంగా ఉంది నీ వేషం" అన్నారు గబుక్కున ఆయనే!!

రామబ్రహ్మంగారు మెచ్చుకున్నారు.

నాగేశ్వరరావుకు, అంతకన్న నాకూ చాలా సంతోషం తృప్తి కలిగాయి. అదీ అప్పటి కథ.

* * *

తరువాయికథ తెరమీద చూచినదే.

నేను చూడగలిగినది నాగేశ్వరరావు చిత్తశుద్ధి, సంకల్పబలం, అందుకు ప్రయత్నం. అతను కష్టపడ్డాడు. కావాలనుకున్నది సాధించాడు. అందుచేత అతని అభ్యున్నతికి కారణం ఘటన బలం అని నేను అనను. అది నటనఫలం.



సువర్ణ సుందరిలో



'పల్నాటి యుద్ధం'లో బాలచంద్రుడు.

### శ్రీ ఎస్. ఎస్. వాసన్

"ఇది విశిష్టమైన ఉత్సవం. అరుదైన సందర్భం. నాగేశ్వరరావు వ్యక్తిగతంగానేకాక, (చలనచిత్ర) పరిశ్రమలో కూడా ఒక ఉత్తమ ప్రమాణాన్ని నెలకొల్పాడు. తన అభివృద్ధికి కారకులైన వారికి కృతజ్ఞత తెలుపడమేకాక, ఒక సత్కార్యానికి భూరి విరాళం ఇవ్వడం అతని సహృదయతను చాటుతోంది.

ప్రతిభావంతుడైన ఈ నటుడు ఇతోధిక విజయాలు సాధించడానికిది దోహదం చేయగలదని ఆశిస్తున్నాను.

### శ్రీ బి. ఎన్. రెడ్డి

గొప్ప నటుడు సన్మానాలందుకోవడం సహజము, సముచితమూ. ఇపుడు నాగేశ్వరరావే చలనచిత్ర పరిశ్రమను సత్కరిస్తున్నాడు. ఈ దృష్టితో ఇది గణనీయమైనది...అతని ప్రతిభగురించి కొత్తగా చెప్పవలసినదేమీ లేదు. నటుడుగానేకాక వ్యక్తిగా కూడా గొప్పవాడనిపించుకొన్న నాగేశ్వరరావుకు చిరాయురైశ్వర్యాలు ప్రసాదించాలని ఈశ్వరుని కోరుతున్నాను.

### శ్రీ సుందర్‌లాల్ నహతా

"...మీరు ధరించినది ఏ పాత్ర అయినా ఏకోణంలోంచి చూచినా అది రాణించి వజ్రంలా ప్రకాశించింది. మమ్మల్ని నటశ్రేణిలో యువరాజుగా ఎంచిఆదరించిన లక్షలాది ప్రేక్షకులను, ఇటుపైకూడా నిర్దుష్టమైన మీ నటనతో ఆనందపరచగలరని ఆశిస్తున్నాను.



"మాయాబజార్" లో అభిమన్యు కుమారుడు.

# నటనలో నిత్య జీవనంలో శీలవంతుడు

శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారు

మహా నదులన్నీ, పుట్టినచోట, అతి చిన్నవిగా వుంటాయి. పోనుపోను విశాలతరములవుతూ, యిరుప్రక్కలా, లక్షలాది యకరములను సస్యశ్యామలంగా చేస్తూ, బంగారు పండిస్తూంటాయి.

మామూలు రాయిలాగ రాళ్ళగుట్టల్లో వున్న రత్నం, రాపిడి జెంది, కాల క్రమేణ, కాంతిపుంజముల నీనుతూ, బయటపడుతుంది.

ఈ సత్యములే సంఘ జీవితములో కొందరు వ్యక్తులపట్ల, అక్షరాల వాస్తవిక మవుతాయి. దీనికి మిత్రుడు అక్కినేని నాగేశ్వరరావు జీవిత మొక ప్రత్యక్ష నిదర్శనము.

ఇతడు, కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా, వెంకటరాఘవాపురం గ్రామంలోని ఒక చిన్న సామాన్య కుటుంబము నుండి వచ్చాడు. మొదట్లో చదువు సామాన్యము. పాలాల్లో గ్రావ్యముగా, తన చిన్న గొంతుకతో, గొంతెత్తి, మైమరచి పాడుతూవుంటే, ముద్దులొల్కే ఆ చిననాటి, అతి సామాన్యమైన, ఆ నాగేశ్వరరావు యింతటి వాడౌతాడాని, ఎవ్వరూహించారు?

మొదట నాటకాల్లోకి వచ్చేరోజున యింటి పెద్దలు, యిష్టపడలేక పోయారు. ఆరోజుల్లో నాటకాల్లోకి వెళ్ళేవారు చెడిపోతారను గట్టి నమ్మిక ప్రజల్లో వుంది. ఆ భయములో పెద్దలు అభ్యంతరాలు చెప్పారు. ఎటులనో నాగేశ్వరరావు బయటపడ్డాడు.

శ్రీ కోడూరి అచ్చయ్య, దుక్కిపాటి మధుసూదనరావుగార్లు, నాగేశ్వరరావు విషయంలో, తగు శ్రద్ధ వహించారు. నాగేశ్వరరావు కూడ క్రమశిక్షణతో మెలగాడు. శ్రద్ధగా నేర్చుకున్నాడు. ఆదిలో స్త్రీ పాత్రలు అభినయించాడు. చక్కగా అభినయించి రాణింపు పొందసాగాడు. మొగ్గ వీడ దొడగింది. సౌరభములు వ్యాప్తం గాసాగాయి. ఇంతలో ఆ నాటక సమాజం ఏ కారణంవలనోగాని మూయబడింది.

శ్రీ దుక్కిపాటివారు నాగేశ్వరరావుకు ప్రోత్సాహమిచ్చి, సినిమా రంగమునకు ఎక్కించారు. ఆనాటి నుండి దినమొకరీతిగా, మిత్రుడు నాగేశ్వరరావు అభివృద్ధినొందుతూవచ్చాడు. నేటికి అరువది చిత్రముల్లో ప్రశంసా పాత్రంగా నటించాడు. ఇది సామాన్య విషయం గాదు.

కవి హృదయమును గుర్తించి, పాత్రలు యే రసపోషణకై లక్ష్యింపబడినవో అర్థము చేసికొని, సాధ్యమైనంతవరకు పాత్రల సమీపమునకు వెళ్ళి, సమైక్యతను జెంది, తాను తన్మయత్వమును బొంది, ప్రేక్షక లోకమును తన్మయపరిచి, ఆనందింప జేయగల్గిన ఉత్తమ నటుడుగా, పరిణామం జెందినాడు. దేవదాసుగా, నాగేశ్వరరావు ఆంధ్రదేశములో చిరంజీవి. ప్రతివారినోట నాగేశ్వరరావున్నాడు. ఈనాడు తెలుగునాట నాగేశ్వరరావు పేరుగనివారు లేరనుటలో, అతిశయోక్తి అణుమాత్రములేదు. అబాలగోపాలమూ ఇతడున్న సినిమా జూచుటకువుబలాట పడుతూంటారు.

అతడు పరిపూర్ణ కళారాధకుడయ్యాడు. కళ అతని యింటి ఆడపడుచు అయింది. లక్ష్మి అతడ్ని వరించింది. అయినా గర్వదేవత అతనికి జడిసి, దూరముగానే వుంటూంది. అతని వుదారత చెక్కుచెదరలేదు. అతడు గతమును విస్మరించలేదు. తన కుటుంబము సంతతిను వుద్ధరించినాడు. అంతటితో అతని వుదారత ఆగలేదు. అతడు దీన జనులను మరచిపోలేదు. అనేక దానములను జేస్తూ వస్తున్నాడు. ఇపుడు 25 వేల భూరి విరాళము, ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు యిస్తున్నాడు. ఇతడు తెలుగు ఆదర్శ యువలోకములో నొక బంగారు మచ్చుతునక.

ఈ రంగములో, శీలానికి భంగం లేకుండా వుండడము మరో కష్టమంటారు. ఇతడీ అసిధారా వ్రతములో కొకలు తీరిన బంటై నిల్చాడు. ఇట్టి బంగారు బిడ్డను గన్న తెలుగుతల్లి ధన్యురాలు.

ఇతడు ఆంధ్ర యెల్లలుదాటి హిందీ ఫిల్ము ప్రపంచములో నటించులాగయితే, మొత్తము భారత దేశములో గూడ గణనకెక్క గలడనుటలో సందియము లేదు. అద్వితీయ భవిష్యత్తులో అలాంటి సదవకాశము కలుగును గాక యని ఆశిస్తున్నా.

తెలుగుతల్లి గర్వించగల్గిన ఈ బిడ్డడు చిరకాలము, ఆయురారోగ్యములు గల్గి, తన కళాసేవతో, ప్రజానీకమును, ఆనందింప జేయును గాక యని, పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

## సినిమా జంట నగరాలలో సినిమాలు

| థియేటర్ | చిత్రం | |
|---|---|---|
| రాజేశ్వర్ | సువర్ణసుందరి | (తెలుగు) |
| రహత్ మహల్, లీగల్ | మాయాబజార్ | ,, |
| కమల్, మినర్వా, మార్కండేయ | రాజపుత్రి రహస్యం | ,, |
| సుభాష్ | ఖైదీ | (హిందీ) |
| రాయల్, కృష్ణ చిత్ర | అమరసింగ్ రాథోర్ | ,, |
| అశోక్ | చంపాకలి | ,, |
| ప్రభాత్ | పరివార్ | ,, |
| దీపక్ మహల్, పారమౌంట్ | జిందగీకె మేలే | ,, |
| లిబర్టీ, స్టేట్ | సమందర్ | ,, |
| పారడైజ్ | బసంత్ పంచమి | ,, |
| దిల్షాద్, మనోహర్ | బందీ | ,, |
| లైట్ హౌస్ | The Crooked Web | |
| డ్రీంలాండ్ | Fate of Two Queens | |
| ప్లాజా | The Man With The Golden Arm | |

## మద్రాసులో సినిమాలు

| థియేటర్ | చిత్రం | |
|---|---|---|
| చిత్ర, ప్రభాత్, సరస్వతి, రాక్సీ | యార్ పయ్యన్? | (తమిళం) |
| వెలింగ్టన్, భవాని, క్రౌన్ | మల్లిక | ,, |
| గెయిటీ, భారత్, మహాలక్ష్మి | తంగమలై రహస్యం | ,, |
| కాసినో | మాయాబజార్ | ,, |
| కపాలి | అల్లావుద్దీన్ అద్భుతదీపం | ,, |
| రాజకుమారి | రంగూన్ రాధ | ,, |
| ప్లాజా | ప్యాసా | (హిందీ) |
| అశోక్ | మిస్ ఇండియా | ,, |
| స్టార్ | మిస్టర్ ఎక్స్ | ,, |
| ఉమ | చెంగిజ్ ఖాన్ | ,, |
| శ్రీ పద్మనాభ | నాగ్ పద్మిని | ,, |
| ఓడియన్ | Loves of A Scoundrel | |
| మిడ్‌లాండ్ | The killer Is loose | |
| న్యూగ్లోబ్ | Three Bravemen | |
| న్యూ ఎల్ఫిన్‌స్టన్ | The Wrong Man | |
| మినర్వా | The Tea House of August Moon | |



# నాగేశ్వరరావు నటించిన 60 చిత్రాలు

నాగేశ్వరరావు పాల్గొన్న తొలి చిత్రం 'ధర్మపత్ని' అందులో అతను బడిపిల్లలలో కలసి ఆడుకున్నాడు. అంతే అతని వేషం. ఆ తరువాతి చిత్రంలో అతడు ముఖ్య భూమిక (శ్రీరాముడు) ధరించాడు. అప్పైన నాయక పాత్రధారిగానే ఒక సుస్థిరస్థానం గడించుకొన్నాడు.

నాగేశ్వరరావు నటించిన 60 చిత్రాలలోనూ 24 చిత్రాలు శతదినోత్సవాలు చేసుకున్నాయి. వీటిలో ఐదుచిత్రాలు 25 వారాలు ప్రదర్శన పొందిరజతోత్సవాలు కూడా జరుపుకున్నాయి.

కొగా భారతి ప్రభుత్వం నాలుగేళ్ల నాడు ఉత్తమ చలనచిత్ర కళాకారులను గౌరవించడానికై ఏటేటా బహుమతి ప్రదానం ఏర్పాటు చేయుటం ఆరంభించింది. ఇతను పాల్గొన్న చిత్రాలలో మూడుచిత్రాలు ఆ బహుమతులను సంపాదించుకున్నాయి.

భరణీవారి 'విప్రనారాయణ,' రాగిణీవారి 'అర్ధాంగి' రాష్ట్రపతి ప్రశంసా పత్రాలు అందుకున్నాయి.

విక్రంవారి 'తెనాలిరామకృష్ణ' అఖిలభారతస్థాయిలో ప్రశంసాపత్రం, రాష్ట్రపతి రజత పతకం అందుకుంది.

నాగేశ్వరరావు చిత్రాలు ఈ క్రింద పొందుపరుస్తున్నాను.

## తెలుగు చిత్రాలు

| చిత్రం | తేదీ | |
|---|---|---|
| ధర్మపత్ని | 10- 1-41 | |
| సీతారామ జననం | 1-12-44 | |
| మాయలోకం | 10-10-45 | శతదినోత్సవం |
| ముగ్గురు మరాటీలు | 1- 6-46 | ,, |
| పల్నాటి యుద్ధం | 24- 9-47 | |
| రత్నమాల | 2- 1-48 | శ. ది. |
| బాలరాజు | 26- 2-48 | రజతోత్సవం |
| కీలుగుర్రం | 19- 2-49 | శ. ది. |
| రక్తరేఖ | 80- 4-49 | |
| లైలామజ్ను | 1-10-49 | శ. ది. |
| లక్ష్మమ్మకథ | 26- 2-50 | |
| పల్లెటూరి పిల్ల | 27- 4-50 | శ. ది. |
| పరమానందయ్య శిష్యులు | 6-10-50 | |
| స్వప్నసుందరి | 19-11-50 | |
| సంసారం | 29-12-50 | శ. ది. |
| తిలోత్తమ | 16- 2-51 | |
| సౌదామిని | 11- 4-51 | |
| మాయలమారి | 14- 6-51 | శ. ది. |
| స్త్రీ సాహసం | 9- 8-51 | |
| మంత్రదండం | 11- 9-51 | |
| ప్రేమ | 21- 3-52 | |
| పరదేశి | 14- 1-53 | |
| బ్రతుకు తెరువు | 6- 2-53 | రజతోత్సవం |
| కన్నతల్లి | 16- 4-53 | |
| వయ్యారిభామ | 6- 6-53 | |
| దేవదాసు | 26- 6-53 | రజతోత్సవం |
| నిరుపేదలు | 2- 3-54 | |
| చక్రపాణి | 19- 8-54 | |
| పరివర్తన | 1- 9-54 | |
| విప్రనారాయణ | 10-12-54 | రాష్ట్రపతి ప్రశంసాపత్రం |
| అన్నదాత | 17-12-54 | |
| మిస్సమ్మ | 12- 1-55 | శ. ది. |
| అర్ధాంగి | 26- 1-55 | శ.ది.; రాష్ట్రపతి ప్రశంసాపత్రం |
| రోజులుమారాయి | 14- 4-55 | రజతోత్సవం |
| అనార్కలి | 28- 4-55 | శ. ది. |
| సంతానం | 5- 8-55 | శ. ది. |
| వదిన | 9- 9-55 | |
| దొంగరాముడు | 1-10-55 | శ. ది. |
| తెనాలిరామకృష్ణ | 12- 1-56 | అ. భా. ప్రశంసాపత్రం, రాష్ట్రపతి రజతపతకం |
| ఇలవేలుపు | 21- 6-56 | శ. ది. |
| చరణదాసి | 20-12-56 | |
| తోడికోడళ్లు | 11- 1-57 | శ. ది. |
| సతీసావిత్రి | 12- 1-57 | |
| మాయాబజార్ | 27- 3-57 | 1. ది. |
| అల్లావుద్దీన్ | 13- 4-57 | |
| సువర్ణసుందరి | 10- 5-57 | |
| దొంగల్లో దొర | 19- 7-57 | |



"వదిన" చిత్రంలో.

## తమిళ చిత్రాలు

| చిత్రం | తేదీ | |
|---|---|---|
| మాయమలై | - 8-51 | |
| సౌదామిని | 11- 4-51 | |
| వన్ నైట్ | 11- 4-51 | |
| స్త్రీ సాగసం | 21- 9-51 | |
| మాయక్కారి | 4-12-51 | |
| కాదల్ | 14- 6-53 | |
| పూంగోదై | 1- 2-53 | |
| ప్రెటకాయ్ | 15- 5-53 | |
| దేవదాస్ | 11- 9-53 | రజతోత్సవాలు |
| మాదర్ కుల మాణిక్యం | 31-12-56 | శతదినోత్సవం |
| ఎంగల్ వీట్టు మహాలక్ష్మి | 1- 2-57 | శ. ది. |





## నాగేశ్వరరావుకు పాలకొల్లులో సన్మానం

పాలకొల్లు, జూలై 23: ప్రఖ్యాత చలనచిత్ర నటుడు శ్రీ ఎ. నాగేశ్వరరావును వచ్చే నెల 1 వ తేదీన పెద్దఎత్తున సన్మానించాలని పురపాలకసంఘం నిర్ణయించింది.

సన్మానానికి అవసరమయ్యే ఏర్పాట్లు చేసేందుకు దిగువవారితో ఆహ్వాన సంఘాన్ని నియమించారు. శ్రీయుతులు సి. సూర్యారావు (అధ్యక్షుడు), డి. వెంకట్రాజుగుప్త, ఎం. వెంకటరామదాసు (ఉపాధ్యక్షులు), బి. విశ్వనాథం, ఎ. వీరాస్వామిరాజు (కార్యదర్శులు), వి. పురుషోత్తం (కోశాధికారి), మరో 45 మంది సభ్యులు.

Printed and Published for Nageswaar Rao Estates (private) Ltd., by S. Radha Krishna, at The Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty St., Madras-1. Editor S. Sambhu Prasad.